# ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్

## రాజకీయమహాసభలప్రత్యేకసంచిక



# ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్

## రాజకీయ మహాసభల ప్రత్యేక సంచిక

ఆంధ్రరత్ననగర్, గుంటూరు

10, 11, 12 డిశెంబరు 1955

ప్రారంభకులు :

భారతప్రధాని

శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ

అధ్యక్షులు :

ఆంధ్రరాష్ట్ర ముఖ్యమంత్రి

శ్రీ నీలం సంజీవరెడ్డి

జండా ప్రతిష్ఠాపకులు :

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షులు

శ్రీ అల్లూరి సత్యనారాయణరాజు

ఆహ్వానసంఘాధ్యక్షులు :

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కార్యదర్శి

శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి

వెల 0-8-0

ప్రచురణ:- యన్. సత్యనారాయణరావు, గుంటూరు 2

# విజ్ఞప్తి

ఆంధ్రరాష్ట్ర 20వ రాజకీయ మహాసభలు నేడు అత్యంత రాజకీయ ప్రాశస్త్యంకలిగిన గుంటూరునగరంలో జరుగుచున్నవి.

ఆంధ్రరాష్ట్రావతరణానంతరం ప్రప్రథమంగా జరిగే రాష్ట్రరాజకీయ మహాసభలు యివే. అంతేకాదు ఎన్నో సంవత్సరాలనుండి ముక్కోటి ఆంధ్రులు ముక్తకంఠంతో కోరుతున్న "విశాలాంధ్ర" నేడో రేపో ఏర్పడనున్న ఈ శుభసమయంలో రాష్ట్రరాజకీయ మహాసభలు జరగటం గమనార్హం.

ఆంధ్రలో ఇటీవల జరిగిన ఎన్నికలలో ప్రజాస్వామ్యశక్తుల కలయికతో వెల్లివిరిసిన ఉత్సాహోద్రేకాలు ఈ మహాసభలతో ఇనుమడించగల వనుటలో సందేహం ఏమాత్రం లేదు.

ఆంధ్రరాష్ట్రాన్ని ఎదుర్కొంటున్న ప్రబలసమస్యల పరిష్కారానికి మార్గాలను సూచించి, ఏర్పడనున్న విశాలాంధ్రకు రూపురేఖలు తీర్చి దిద్దుటకు ప్రజలలో వినూత్న తేజోవికాసాలను కలిగించి, కార్య క్రమమిచ్చి ఉచితరీతిని నడిపించగలందులకు ఈ చారిత్రాత్మక సమావేశం కారణభూతం కాగలదని ఆశిస్తాను.

ఆంధ్రలో జాతీయోద్యమును వివరించు ప్రముఖులవ్యాసాలు, మహాసభల విశేషాలు, కలిగిన ఒక ప్రత్యేకసంచికను ప్రచురించ సంకల్పించి దీనిని మీకందిస్తున్నాను. ఇంతకన్నా ఎక్కువవివరాలు, చిత్రాలు, విశేషంగా మీకందివ్వ లేకపోవటం కొందరి సహకార లోపమేకాని నా ప్రయత్న లోపంకాదు. నాకీఅవకాశం కల్పించిన ఆహ్వానసంఘమువారికి, అడిగినదే తడవుగా శ్రమకోర్చి వ్యాసములను వ్రాసియిచ్చిన రచయితలకు, తమసందేశములు, శుభాకాంక్షలు పంపిన పెద్దలకు నా ప్రయత్నంలో సహకరించిన శ్రీ ఏటుకూరి ప్రసాదరావు, నందమూరి కామరాజుపంతులుగార్లకు, ప్రకటన దార్లకు కృతజ్ఞత తెలుపుచున్నాను.

— ప్రచురణకర్త.

# MESSAGES

## S. Radhakrishanan

VICE - PRESIDENT
INDIA

*I Send my best wishes for the success of your Special Number*

## B. Pathabhisitaramayya

GOVERNOR
Madhaya Pradesh

Raj Bhavan,
Nagpur – 1.
3rd November 1955

The Andhra Provincial Conference is as old as the Andhra Provincial Congress Committee which was carved out in January 1918. Prior to that we had the Andhra Conference which continued as a separate institution for some time even after the Provincial Congress Committee was formed and the Provincial Congress Committee organized an Andhra Provincial Conference ever since the Congress Committee was established. The importance of the Provincial Conference has somewhat suffered after the Political centre of gravity has shifted to the Legislatures and more particularly after the adult franchise has robbed the old Congress Committees of their importance. Nevertheless the Provincial Conferences have been as it were the seed-beds of various schemes and suggestions which after being once approved of by a Provincial Conference make their way to the Legislatures. Mr. Sanjeeva Reddy, I am glad, who carries a grey head on green shoulders is your President. Under his advice and able guidance, I am sure, you will have a successful session of the Conference.

# నేటి మహాసభల ప్రారంభకులు



## శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ

విశ్వమానవ సౌభ్రాతృత్వము శాంతి, సౌహార్ద్రాలే పరమాశయముగా నెంచి స్వార్థపరత్వము, కుటిలత, అధికారవ్యామోహము అంటే ఎరుగని శ్రీ జవహర్ లాల్ నెహ్రూ భారత ప్రజల ఆదరాభిమానాలేగాక యావత్ ప్రపంచ ప్రజల ప్రేమ పురస్సరస్వాగతాశీర్వాదాలను కూడ పొందుచున్నారనుటలో ఆశ్చర్యమేమియు లేదు. అంతర్జాతీయ సమస్యలపై గంభీర భావస్ఫూర్తితో కూడిన నెహ్రూ ప్రకటనలు ప్రపంచమును జాతిమత విచక్షతారహితముగా రూపొందించుటయే గాక, కోటానుకోట్ల ప్రజామోద ముద్ర బడయుచుండుట ప్రపంచమందలి ప్రతి మానవుడును అందున ముఖ్యముగా ప్రతిభారతీయుడు ఎరిగిన విషయమే.

శ్రీ జవహరలాల్ నెహ్రూ ప్రతిపాదించిన "పంచశీల" భారత విదేశ విధాన మంతటికి సూత్ర

ప్రయోగమగుటయేగాక నేటి జటిలతర ప్రపంచ రాజకీయ సమస్యల పరిష్కారమునకై ఏకైక సాధనముగా గుర్తించబడి, అమెరికా, బ్రిటన్, ఫ్రాన్సు, కమ్యూనిస్టు రాజ్యాల మధ్య పరస్పర అవిశ్వాస కారణముగా రగులొన్న విద్వేషాగ్ని జ్వాలలు కొంతవరకు చల్లార్చినదనుటలో సందేహము లేదు.

ఇండో చైనా, ఫార్మోజాలలో వ్యాపించిన యుద్ధ మేఘాలతో తృతీయ ప్రపంచ సంగ్రామము వాటిల్లగలదని మానవకోటి యావత్తు భయకంపితులై ఉన్న రోజులలో శ్రీ నెహ్రూ వివిధ దేశాధిపతులకు, ప్రజానీకమునకు శాంతిసహనముల గూర్చి యుద్బోధించి విశ్వశాంతి సంధాతగా వేనోళ్ళ కీర్తించబడెను.

శ్రీ జవహరలాల్ నెహ్రూ 1948లో ఢిల్లీలో సమావేశపర్చిన ఆశియా దేశాల మహాసభ ఇండోనీషియా స్వాతంత్ర్య సమరమునకు చేయూతనొసంగుటయేగాక వలస విధాన నిర్మూలనకు పునాదులు వేసినది. పెట్టుబడిదారీ దేశాల వలస విధానమున కంతమొందించ తీర్మానించిన బాండుంగ్ సమావేశపు సంధానకర్తలలో నెహ్రూ ప్రముఖుడు.

మాజీ అమెరికా రాయబారి చెష్టర్ బౌల్సు పేర్కొన్నట్లు, గత మూడు దశాబ్దములుగా భారత రాజకీయ రంగములో సత్యంత ప్రముఖపాత్ర వహిస్తున్న శ్రీ జవహర్ లాల్ నెహ్రూను గూర్చి క్లుప్తంగా నాలుగు మాటలలో చెప్పటము ఎవ్వరికైనాఅసాధ్యమే!

1889వ సంవత్సరము నవంబరు 14వ తేదీన అలహాబాదులో జననమొందిన శ్రీజవహర్ లాల్ నెహ్రూ హేరో, ట్రినిటీ, కేంబ్రిడ్జిలలో ఉన్నతవిద్య నభ్యసించి, ఇన్నర్, టెంపుల్ లండన్ లో బారిష్టరు పరీక్షయందు తీర్ణుడై 1912 సం॥ అలహాబాదు హైకోర్టులో న్యాయవాదవృత్తి నవలంబించెను.

1918 లో అలహాబాదులోని హోంరూలులీగు కార్యదర్శిగాను, అఖిల భారత కాంగ్రెసు సభ్యుడుగాను ఎన్నుకోబడెను. 1922 సం॥ లో వేల్సు యువరాజు భారత దేశపు సందర్శన సందర్భములో మొదటిసారి అరెస్టుకావింపబడెను. అదే సంవత్సరము అలహాబాదు పురపాలకసంఘాధ్యక్షుడుగా ఎన్నుకొనబడెను. తిరిగి 1930సం॥ ఉప్పు

సత్యాగ్రహములోను, 1932, 34 40, 42, 45 సం॥ లలో జరిగిన జాతీయోద్యమాలలోను అరెస్టు కావింపబడి, మొత్తం 7 సం॥ లు కారాగార జీవితము గడిపెను.

1933 సంవత్సరము బ్రెసెల్సులో జరిగిన అఖిల ప్రపంచ వెనుకబడ్డ జాతుల మహాసభకు భారత కాంగ్రెసు ప్రతినిధిగా హాజరై, యూరపుపర్యటన గావించెను. ఈ సందర్భములోనే శ్రీ నెహ్రు ప్రప్రథమముగా సోవియట్ రష్యాను సందర్శించి అచ్చట జరుగుచున్న నిర్మాణ కార్యక్రమములను అవలోకించి సోవియట్, భారత దేశముల రైతాంగ ఆర్థిక సమస్యలలో కొంతవరకు సామ్యమున్నదని గ్రహించెను. తిరిగి శ్రీ నెహ్రు 1955లో మార్షల్ బుల్గానిన్ ఆహ్వానముపై సోవియట్ రష్యా సందర్శించెను.

ఇప్పటివరకు భారత కాంగ్రెసు అధ్యక్షపదవిని ఆరుసార్లు అధిష్ఠించిన గౌరవము శ్రీ జవహరలాల్ నెహ్రు కొక్కరికే మాత్రమే దక్కుతుంది. 1939లో అఖిల భారత సంస్థాన ప్రజామండలి ప్రధమాధ్యక్షుడుగా ఎన్నుకోబడెను. ఇదే సంవత్సరం ఆగష్టు నెలలో శ్రీ నెహ్రు చైనా సందర్శించెను. చుంకింగ్‌లో పండిత నెహ్రూకు చైనా ప్రజలు అధికారులు, ఘనస్వాగత మొసంగిరి. తిరిగి 1954 లో మావో - సే - టుంగు ఆహ్వానముపై నవచైనా సందర్శించెను. 1948 లో ప్రెసిడెంటు ట్రూమన్ ఆహ్వానముపై అమెరికా, 1954లో ఆగ్నేయాసియా దేశాలు పర్యటించెను.

1942 క్రిప్సురాయబారములో అఖిల భారత కాంగ్రెసుసంస్థ ప్రతినిధిగా పాల్గొని అత్యంత ప్రముఖ పాత్రవహించిన శ్రీ జవహరలాల్ 1946 లో లార్డుమౌంట్ బాటన్ ఏర్పరచిన తాత్కాలిక మంత్రివర్గంలో కామన్ వెల్తు, విదేశ వ్యవహారాల శాఖా మాత్యుడుగను, ఉపాధ్యక్షుడు గాను నియమింపబడెను. 1947లో స్వతంత్ర్య భారత ప్రభుత్వపు ప్రధాన మంత్రిగా ఎన్నుకోబడి యిప్పటివరకు ఈ పదవిని అధిష్టించియున్నారు.

శ్రీ జవహరలాల్ నెహ్రూ శాంతియుత విదేశాంగవిధానమున కొక అగ్నిపరీక్షగా మారిన గోవా సమస్యపై హింసాయుత విధానము ద్వారా గోవాను వశపర్చుకొనుట

లేదని ప్రకటించారు. నెహూ్రు, భారతదేశం నలుమూలల నుండి తీవ్ర ప్రాతికూల్యము నెదెర్కొన వలసి వస్తుందని భారత రాజకీయ జ్ఞులేగాక విదేశ రాజకీయ నాయకులు సహితం ఊహాగానంచేశారు. కాని నెహూ్రు ప్రకటన వెలువడిన వెంటనే గోవా సత్యాగ్రహం ఆకస్మికంగా అంతర్ధానమయినది. దీని కంతటికి కారణం శ్రీ జవహరలాల్ నెహూ్రు అసమాన రాజకీయచాతుర్యమే. అప్రతిహతవ్యక్తిత్వమే.

గోవా సమస్య చల్లబడిన వెంటనే, రాష్ట్రాల పునర్విభజనసంఘ సిఫార్సులపై పరస్పర వైరుధ్య ఫలితములతో కూడుకొన్న భాషా రాష్ట్రవాదుల కోర్కెలను పరిష్కరించవలసిన క్లిష్ట సమస్య, నెదుర్కొనవలసి వచ్చింది. ఈ సమస్యను శ్రీ నెహూ్రు ఎట్లు పరిష్కరిస్తారోనని భారత ప్రజానీకమేగాక విదేశ పత్రికలు, రాజకీయ నాయకులు, వేయి కన్నులతో ఎదురు చూస్తున్నారు.



నేటి రాజకీయ మహాసభాధ్యక్షులు

ఆంధ్రప్రభుత్వ ఉపముఖ్యమంత్రి

గౌ॥ నీలం సంజీవరెడ్డి

# నేటి మహాసభాధ్యక్షులు

## గౌ॥ నీలం సంజీవరెడ్డి

అనంతపురం జిల్లాలోని ఒక కుగ్రామంలో 1913వ సంవత్సరం మే నెల 12వ తేదీన ఒక సాధారణ రైతు కుటుంబములో జన్మించిన శ్రీ సంజీవరెడ్డి అడయార్ లో ప్రాథమిక విద్యాభ్యాస మొనర్చి అనంతపురం ఆర్ట్సు కాలేజీలో ప్రవేశించిరి. వీరు విద్యార్థి దశలోనే యువజనోద్యమము లందు అత్యంత శ్రద్ధవహించిరి. మహాత్మా గాంధీ పిలుపు నందుకొని కాలేజీ విద్యకు స్వస్తిచెప్పి జాతీయోద్యమములో ప్రవేశించిరి. 1938 సం॥లో ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘ కార్యదర్శిగా ఎన్నికై ఎనిమిది సంవత్సరములపాటు ఆ పదవిని నిర్వహించెను. 1940వ సంవత్సరమున వ్యక్తి సత్యాగ్రహ మొనరించి సందుకు అరెస్టు కావింపబడెను. తిరిగి 1942 ఆగస్టులో బొంబాయిలో జరిగిన అఖిలభారత కాంగ్రెస్ మహాసభకు హాజరై తిరిగి వచ్చుచుండగా అరెస్టు కావింపబడి వెల్లూరు జైలుకు తీసుకొనిపోబడిరి. అచ్చటనుండి వీరిని మధ్యప్రదేశ్ లోని అమ్రోట్ జైలునకు మార్చి 1945లో విడుదలగొనర్చిరి. ఆరోజులలో కాంగ్రెస్ పార్టీపై నిషేధ ముండుటచేత శ్రీ సంజీవరెడ్డి తన పార్టీ కార్యకర్తలు కొంతమంది సహకారములో ప్రచ్ఛన్నముగా కాంగ్రెసు సమావేశములు జరిపి రాయలసీమలో విప్లవకారుల ఉపద్రవము నెదుర్కొనుటకు ఏర్పాట్లు గావించెను. 1947లో అనంతపురం నియోజక వర్గమునుండి మద్రాసు శాసన సభకు సభ్యునిగా ఎన్నికై శాసనసభ కాంగ్రెస్ పక్ష కార్యదర్శిగా పనిచేసెను. భారత రాజ్యాంగసభ సభ్యునిగా ఎన్నుకొనబడెను. 1949వ సంవత్సరములో శ్రీ కుమారస్వామి రాజా మంత్రి వర్గములో మద్యనిషేధ శాఖా మాత్యునిగా నియమింపబడెను. 1921వ సం॥ నుంచి అనంతపురం జిల్లాలో ఒక గ్రామములో

మద్యనిషేధ ఉద్యమములో అత్యంత సన్నిహితత్వము కలిగిన శ్రీ సంజీవరెడ్డి, మద్యపాననిషేధ శాఖా మాత్య పదవిని అత్యంత సమర్థతతో నిర్వహించిరనుటలో అతిశయోక్తి లేదు.

1951లో ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్ష పదవికి ఎన్నికయ్యెను. 1952లో మద్రాసు శాసన సభ నుండి, రాజ్య సభా సభ్యుడుగా ఎన్నుకోబడెను. 1952లో జరిగిన మద్రాసు శాసనసభ ఎన్నికలలో పరాజయమొందిన పిమ్మట, మరొకసారి ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షుడుగా ఎన్నికై, కాంగ్రెసు పార్టీలో తనకుగల పలుకుబడికి నిదర్శనము ప్రదర్శించెను. 1953 సెప్టెంబరులో ఆంధ్రరాష్ట్ర శాసన సభకు కాళహస్తి నియోజక వర్గము నుండి జరిగిన ఉపఎన్నికలో ఎన్నికై రాష్ట్ర విభజనానంతరము ఆంధ్ర శాసనసభ కాంగ్రెసుపార్టీ నాయకునిగా ఎన్నుకోబడి శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులు గారి అధ్యక్షతన ఏర్పడిన ప్రప్రథమ ఆంధ్ర మంత్రి వర్గంలో డిప్యూటీ ముఖ్య మంత్రిగా నియమింపబడెను. 1955 జనవరి నెలలో జరిగిన ఆంధ్ర శాసనసభ ఎన్నికలలో కాళహస్తి నియోజక వర్గంనుండి తిరిగి ఎన్నికై శ్రీ గోపాలరెడ్డి అధ్యక్షతన ఏర్పడిన మంత్రి వర్గములో తిరిగి డిప్యూటీ ముఖ్యమంత్రిగా నియమింపబడి యిప్పటివరకు యీ పదవిని అత్యంత సమర్థతతో నిర్వహించుచున్నారు. శ్రీ సంజీవరెడ్డి అఖిలభారత కాంగ్రెసు కార్యవర్గమునను, పార్లమెంటరీ బోర్డులోనూకూడా కొంతకాలము సభ్యులుగా పనిచేసిరి.

# గుంటూరు....
# పరిసర చారిత్రక ప్రదేశాలు

ఆంధ్రరాష్ట్రమునకు నడిబొడ్డున గల గుంటూరు, విశేష చారిత్రిక ప్రశస్తి గల ప్రాచీనాంధ్ర నగరము. ఈ నగర ప్రాశస్త్యము దశ దిశల వ్యాపించినట్లు 1147 సం॥ ప్రాంతమున వ్రాయబడిన ఒక శిలాశాసనము వలన తెలియుచున్నది. అనాదియైనగాక ఏడవ శతాబ్దమునందే గుంటూరు ప్రముఖాంధ్ర నగరముగ నుండినట్లు చీనాయాత్రికుడు 'హ్యూయాన్ త్సాంగ్' వ్రాతలవలన తెల్లమగును. భారతము నాంధ్రీకరించిన కవిత్రయమునందలి తిక్కన సోమయాజి యీ గుంటూరు నగర వాసుడే.

భారతజాతీయోద్యమములో ముందంజ వేసి సహాయ నిరాకరణోద్యమము, విదేశ వస్త్రబహిష్కరణము, ఉప్పు సత్యాగ్రహము, పన్నుల నిరాకరణోద్యమములలో ప్రముఖ పాత్రవహించి భారత జాతీయ చరిత్రలో సువర్ణాక్షరాల కొక అధ్యాయమును ప్రత్యేకింప చేసి మహాత్మ గాంధీ ప్రశంస నందినది గుంటూరు నగరమే. ఆంధ్రరాష్ట్రోద్యమము నకు గుంటూరే పుట్టినిల్లు, ఆంధ్రోద్యమ పితామహులనదగు దే॥ శ్రీ॥ దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులుగారు, ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారు, స్వామి సీతారాంగారు ఈ నగరవాసులే.

ఆంధ్ర -- హైకోర్టు





గుంటూరు మెడికల్ కాలేజీ

గుంటూరు, జిల్లా కేంద్రస్థానము. ఆంధ్ర ప్రధాన వ్యాపారస్థానమునకు పేరు. నేటి దీని జనసంఖ్య షుమారు రెండులక్షలు. 1866 సం॥ చిన్నతరగతి పురపాలక సంఘముగా నేర్పడి క్రమక్రమముగా వృద్ధి పొందుతూ, నేడు కార్పొరేషన్ అగు అవకాశములుగల సువిశాలమైన నగరముగా రూపొందినది. నవ్యాంధ్రలో విద్యాసంస్కృతి, సాహిత్య రంగాలలో నైతేనేమి రాజకీయ, క్రీడారంగాలలో నైతేనేమి మిగుల ప్రఖ్యాతివహించి మేటి నగరముగ ఎన్నబడుచున్నది. వస్తువాణిజ్యములకు పొగాకుపరిశ్రమకు, వ్యవసాయమునకు, భూగోళరీత్యా ప్రత్యేక స్థానము నలంకరించినది.

[illegible], [illegible] కార్యాలయము, హిందూ కాలేజి, గవర్నమెంటు స్త్రీల కళాశాల, ఆంధ్ర క్రిస్టియన్ కాలేజి, మెడికల్ కాలేజి, గవర్నమెంటు ఆసుపత్రి- మున్నగునవి చూడదగినవి.

## అమరావతి - నాగార్జునకొండ

ఉత్తర హిందూస్థానంలోని సాంచి, సారనాథ్ లవలె దక్షిణ భారతమున అమరావతి, నాగార్జునకొండలు, విశ్వవిఖ్యాతి నార్జించిన బౌద్ధవిద్యా కేంద్రములు. అప్పటి బయల్పడిన బౌద్ధ విహారాలు, స్థూపాలు, శాసనాలు, శిల్ప కళాసంపద, ఆంధ్ర జాతీయ విద్యాసంస్కృతులకు మహాశిల్పకారుల కళానైపుణ్యమునకు నిదర్శనములుగా నేటికిని, మద్రాసు, లండన్, వస్తుప్రదర్శన శాలలలో వెలుగొందుచున్నవి.



శాంతిసిరి నిర్మించిన స్తూపావశేషము



నాగార్జునకొండలోని ఒక శిల్పము

# కాంగ్రెసు - త్రివర్ణపతాకం

త్రివర్ణ పతాకాన్ని మొదట నిర్మించి, భారత ప్రజలలో విశేష ప్రాచుర్యాన్ని పొందజేసిన గౌరవం, ఖ్యాతి మన ఆంధ్రులకు దక్కుతాయి. దీనిని మొదట నిర్మించిన వారు (శ్రీ) పింగళి వెంకయ్యగారు.

1921 సం॥ ఏప్రియల్ 13వ తేదీగల "యంగ్ ఇండియా" పత్రికలో గాంధీజీ జాతీయ జండాగూర్చి ఈక్రింది విధంగా వ్రాశారు....

"ఏకైక జాతీయ పతాకం కోసం తమ సర్వస్వం త్యాగం చేయడానికి సంసిద్ధులై ఉండాలన్నది మనం విస్మరించకుండా ఉండటం ఎంతో అవసరం. ఇతర జాతుల కుండే పతాకాల ఉద్దేశాలను, ఆశయాలను వర్ణిస్తూ భారత దేశానికి 30 రకాల జండాలను పురమాయిస్తూ శ్రీ పింగళి వెంకయ్యగారు అమూల్యమైన పుస్తకాన్ని భారత ప్రజకందచేశారు. వీరు కొన్ని సంవత్సరాల నుండి జాతీయ పతాక ఆవశ్యకతను గురించి ఎంతో ఉత్సాహంతోను, పట్టుదలతోను, పనిచేస్తున్నారు. గత వార్షిక సంవత్సరాలుగా ప్రతి జాతీయసభ సమావేశానికి హాజరయి పతాక సమస్యను అత్యంతోత్సాహముతో దాని ప్రాముఖ్యతను నచ్చచెప్పారు.

1921 లో విజయవాడ యందు జరిగిన జాతీయ మహాసభకు శ్రీ వెంకయ్యపంతులు గారిని నేను స్వయంగా పిలిపించి ఎరుపు, తెలుపు, ఆకుపచ్చ రంగులు గలిగి మధ్య రాట్నము చిహ్నముగాగల నిరాడంబరమైన జండా ఒక్కటి చిత్రించి యివ్వమని అడిగాను వారి అకుంఠిత ఉత్సాహ ఫలితమే నేడు మనకున్న త్రివర్ణపతాకము"

మహాత్మాగాంధీ గారు 1921 లో వ్రాసిన పైవాక్యాలవలన త్రివర్ణపతాకం ఆవిర్భవించింది. ఆంధ్రదేశంలోనేననీ మనజాతికొక పతాకం కావాలన్న ఊహ ప్రప్రథమంగా ఆంధ్రప్రముఖుని బుర్రలోనే పుట్టిందనీ చెప్పడానికెంతో సంతోషిస్తున్నాను.

భారత స్వాతంత్ర్య పోరాటం ప్రథమ దశలో ఉన్నప్పుడు మన కొక జాతీయ పతాకంలేదు. జాతీయ సమావేశాలలో కూడా పరాయి దేశపు పతాకాలను ఉపయోగించే వాళ్లము. అప్పట్లో అంటే 1907 వ సంవత్సరంలో మునగాల ఎస్టేటు వ్యవసాయ శాఖకు అజమాయిషీ దారుగా నుంటున్న శ్రీ పింగళి వెంకయ్యపంతులు గారు ఈ అసభ్యపు పరిస్థితులను సహించలేక మాతృదేశానికొక ప్రత్యేక పతాకం చిత్రించాలని పూనుకొన్నారు. భారత రాజకీయ నాయకుల కెవ్వరికీ యీ యభిప్రాయం కలుగక ముందే శ్రీ పంతులుగారి నీసమస్య వేధించడం మొదలు పెట్టింది. చిన్నప్పటి నుండి శ్రీ పంతులుగారికి జండాలంటే అపరిమితమైన ఉత్సాహం. ప్రతిదేశపు జండాను ప్రత్యేకంగా పరిశీలించి దాని చరిత్ర తెలిసి

కాని, జెండాలయొక్క విలువను జీర్ణింప జేసికొన్నారు.

భారత దేశంలోని అన్నిమతాల వారికి ప్రేమ పాత్రంగాఉండే ఒక ఏకైకజాతీయ జండా భారత జాతికి అత్యవసరమని ఊహించి జాతీయ జండా ఎట్లాంటిదై ఉండాలనే సమస్యనే తమఅభిమాన విషయంగా పెట్టుకొని ఎంతో శ్రమకోర్చి మన దేశంలోని వివిధ మతాలవారు భిన్నరంగులకు ప్రాముఖ్యాన్ని స్తారన్న విషయాన్ని పూర్తిగాగాని వివిధరంగులలో సర్వమతాలకు సమిష్టిగా ఉండే జాతీయ పతాకాన్ని చిత్రించారు.

తమ అభిప్రాయాలకు సుస్పష్టరూపాలను దిద్దేందుకు 1913 నుండి ప్రతిజాతీయ మహాసభ సమావేశానికి హాజరయి నాయకు లందరితోనూ విపులంగా చర్చించి జాతీయ పతాక తీర్మానాన్ని పెట్టి యావద్భారత దేశానికి ఈసమస్యయొక్క ప్రాముఖ్యాన్ని వెల్లడించారు. 1916 సంllలో "భారత దేశానికొక జాతీయపతాకం" అనే ఆంగ్లగ్రంథాన్ని రచించారు. హూమ్‌రూల్ ఉద్యమం యింకాపుట్టకముందే శ్రీ వెంకయ్య పంతులుగారు బందరు జాతీయ కళాశాల అధ్యాపకులుగా ఉండగావ్రాసిన ఈగ్రంథమే నేటి త్రివర్ణ జాతీయపతాక ప్రతిష్టాపనకు దారితీసింది.

1917 వ సంవత్సరంలో లేవదీయ బడిన హూమ్‌రూల్ ఉద్యమ స్థాపకుల యాజమాన్యంక్రింద ఒక జాతీయ పతాక సంఘాన్ని, ప్రచార శాఖను, పంతులుగారి ప్రోత్సాహంతో జాతీయ మహాసభ ఏర్పరచి, జాతీయపతాక ఆవశ్యకతను ప్రజలకు నచ్చచెప్పారు. వెంకయ్యపంతులుగారు మొదలు పెట్టిన అలజడికి ఎంతోమంది మేధావులు, దేశభక్తులు దోహదమిచ్చి కొన్నిమార్పులు సూచించారు. 1919లో పంజాబు కంతకును వయోవృద్ధుడైనలాలాహన్సరాజ్ అహింసా పద్ధతులమీద మన స్వాతంత్ర్యపోరాటం సాగిస్తున్నాము గాన మన జాతీయజండా మీదకూడా ఆతత్వాన్ని జ్ఞాపకపరచే రాట్నం చిహ్నముంటే బాగుండునని పురమాయించారు. అప్పటికే భారత జాతినంతనూ తన సత్యాగ్రహ సమ్మోహనాస్త్రంతో కట్టివేయగలిగిన మహాత్మాగాంధీగారు కూడా రాట్నచిహ్నమే అనుగుణ్యంగా వుందని అభినందించారు.

ఈవిధంగా జననమందిన త్రివర్ణపతాకం అనతికాలంలోనే ప్రజలలో చైతన్యం కలిగించింది. గాంధీజీ నాయకత్వాన ఎక్కడచూచినా జాతీయ పతాకం ఆ కాలపు వీధులలో ఎగరడం ప్రారంభించింది. సామాన్యప్రజలకు జాతీయ పతాకం పట్లభక్తి, శ్రద్ధలు కలిగించుటకు, వారిలో చైతన్యం కలిగించుటకు ప్రతియేడాది జండాఉత్సవాలు దేశమంతటా చేయుటం ప్రారంభించారు. భారతదేశంలోని అన్నిమతాల వారికి ఏకైక జాతీయజండా ఏర్పడటం ఆంగ్లప్రభుత్వానికి గిట్టలేదు. ఎల్లెడల కలుగుతున్న యీ జాగృతినిచూచి పశుత్వమే పరమావధిగా పెట్టుకొన్న పరాయి ప్రభుత్వం కన్నెర్ర జేసింది. అభం, శుభం, తెలియని భారత ప్రజలను అనేకవిధాల హింసించ మొదలు పెట్టింది తత్ఫలితమే మొట్టమొదట నాగపూర్‌లో జరిగిన జండా సత్యాగ్రహం. 1928 మే 1వ తేదీ నాగపూర్ వీధులలో జండాలతో ఊరేగుతూపోతుంటె 144 వ సెక్షన్‌క్రింద ఆపివేసింది ప్రభుత్వం. కానీ వాలంటీర్లు వినకుండాముందుకు నడిచారు. వారిని అరెస్టుచేసి ఖైదుచేశారు. జూలై

10వ తేదీనాటికి ఈజండా సత్యాగ్రహం అఖిలభారత ఉద్యమంగామారి వల్లభాయి పటేల్ గారిని సత్యాగ్రహ నాయకుడుగా జాతీయ మహాసభ నియమించింది.

నాగపూరు జండా సత్యాగ్రహంలో, అష్టకష్టాలకోర్చి అనేక అవమానలకు గురియయి పతాక ప్రతిష్టను మన వాలంటీర్లు నిలబెట్టటంతో జండాకొక పవిత్రత, సార్వజనీనత, ప్రాప్తించింది. అంతవరకు త్రివర్ణ పతాకాన్ని జాతీయ పతాకంగా ఉపయోగించటానికి విముఖత్వం చూపినవారు గూడ దాని మహాత్మ్యముందు లొంగిపోయారు.

1930 లాహోర్, 31 కరాచీ జాతీయ మహాసభ సమావేశాలలో శిక్కు నాయకులు పతాకపు రంగులను గూర్చి అసంతృప్తిని తెలిపి, ఆందోళన సాగించారు. వారి కోరికలను చర్చించి నిర్ణయించుటకు జాతీయ మహాసభ ఒక ఉపసంఘాన్ని ఏర్పాటు చేసింది. ఈసంఘసిఫార్సుల ననుసరించి జాతీయజండా కుంకుమపువ్వు, ఆకుపచ్చ, తెలుపురంగులు, రాట్నమే చిహ్నంగా ఉండాలని నిర్ణయించింది.

కుంకుమ పువ్వురంగు, శౌర్యాన్ని, త్యాగశీలాన్ని, ఆకుపచ్చరంగు అకుంఠిత భక్తివిశ్వాసాలను, సౌరత్వాన్ని, తెల్లరంగు మన స్వాతంత్ర్య పోరాటానికి ప్రతిపాదకములైన సత్యం, అహింసలకు ప్రత్యక్షనిదర్శనములు అని వివరించబడింది. ఈరంగులపైన గిఱ్ఱునతిరుగే రాట్నము గ్రామజీవితాన్ని, రైతు, కార్మికత్వాన్ని స్ఫురింపజేస్తుంటుంది. అంటే కార్మిక, కర్షకులపై, ఆధారపడిన మనదేశము, సత్యము, అహింసలపై ఆధారపడిన త్యాగము వలన సుభిక్షముగా ఉండవలెనని మన ఆశయము. ఈ ఆశయచిహ్నమే త్రివర్ణపతాకము.

—ది 1-8-54 "ఆంధ్రజ్యోతి"లో వ్యాసం ఆధారంగా

# కాంగ్రెసు విద్యార్థులు

## శ్రీ వాసిరెడ్డి సత్యనారాయణ

### జాతీయోద్యమములో విద్యార్థులు

రవి యస్తమించని బ్రిటీషు సామ్రాజ్యవాదుల నిరంకుశ పెత్తనంనుండి భారతమాతకు విముక్తి కల్గించటానికి సాగిన దీర్ఘకాలిక సమరంలో విద్యార్థులదే పైచేయనటంలో అత్యుక్తి యేమాత్రమూ లేదు. జాతీయ నాయకుల ప్రబోధాలవల్ల ఉత్తేజితులైన విద్యార్థినీయులు ముందు వెనుకలాలోచించక యెనలేని త్యాగాలు చేశారు. నాయకులు మార్గంచూపితేచాలు ఆబాటనే పయనించి విశేషంగా కృషి చేశారు. కాని విద్యార్థులంతా ఒక సమీకృత, సంఘటిత శక్తిగా రూపొందటానికి చాలాకాలం పట్టింది. 1931 వరకూ కాంగ్రెస్ మహాసభల సందర్భంలోనే ప్రత్యేకంగా విద్యార్థి సమావేశాలు జరుగుతూ వుండేవి. కాని భారత రాజకీయ రంగంలో మహాత్మగాంధీ ప్రవేశించిన తరువాత కాంగ్రెస్ ధోరణిలో విప్లవాత్మకమైన మార్పులు జరిగాయి. స్వాతంత్ర్య పోరాటంలోని ప్రతిఘట్టంలోనూ విద్యార్థులే పురోగాములుగా, అగ్రశ్రేణిలో నడువ వలసిన అవసరాన్ని కాంగ్రెస్ నాయకులు గుర్తించారు. అఖిల భారత విద్యార్థి సంస్థ నిర్మాణానికి ప్రాథమిక సన్నాహాలు ప్రారంభించారు. మహాత్మ గాంధీగారే విద్యార్థులందరనూ స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొనవలసిందిగా ఆహ్వానించారు. సహాయ నిరాకరణోద్యమము, విద్యాలయాల బహిష్కరణోద్యమమూ, సైమన్ కమిషన్ బాయికాటు, ఉప్పు సత్యాగ్రహమూ, 1942 ఆగస్టు ఉద్యమముకూడా విద్యార్థుల వీరోచిత పాత్రవల్లనే అంత ప్రాముఖ్యత నందాయి. ఆయా సందర్భాలన్నింటిలోనూ జాతీయ నాయకుల పిలుపు నందుకొని విద్యార్థిలోకం ఏకోన్ముఖంగా నడిచింది.

### విద్యార్థిసంఘాలలో కమ్యూనిస్టుల ప్రాబల్యం

కాంగ్రెస్ మహాసభలలో విద్యార్థి సమావేశాలు జరపటం, ఉద్యమాలు ప్రారంభించినప్పుడు పిలుపునిచ్చి మిగతా సమయాలలోను కార్యక్రమమూ యివ్వక పోవటంవలన విద్యార్థి ఉద్యమంలో జాతీయ శక్తుల ప్రభావం 1934-42 మధ్య కాలంలో సడలిపోయింది. యువక రక్తం పొంగి ప్రవహించే విద్యార్థులు నిర్వీర్యులై చేతులు ముడుచుకొని కూర్చొని వుండలేక పోవటంవలన, ఆ మధ్యకాలంలో విద్యార్థులమీద యితర విధానాల ప్రభావం ప్రసరించింది. కార్యక్రమంలేని చురుకైన సైనికులు, యేదో కార్యక్రమం యిచ్చే వారికి తలయొగ్గారు. 1942 నాటికి విద్యార్థి

సంఘాలు కమ్యూనిస్టు విద్యార్థుల చేతుల్లోనే వున్నాయి. కమ్యూనిస్టు పార్టీ ఆదేశానుసారంగా ఆ విద్యార్థి సంఘాలు కూడా జాతీయ స్వాతంత్ర్య పోరాటానికి వెన్నుపోటు పొడిచినప్పటికీ, క్విట్ యిండియా ఉద్యమ సందర్భంలో విద్యార్థులెక్కడికక్కడ విప్లవకార్యాలు కొనసాగించారు. ఆగస్టు విప్లవంతో విద్యార్థి లోకంలోని జాతీయాభిమానం మరల వెల్లుబికింది. విప్లవశక్తి వెల్లివిరిసింది. చైతన్యం ప్రకాశించింది.

విప్లవానంతరం జాతీయ భావాలు గలిగిన విద్యార్థులంతా కలసి జాతీయ విద్యార్థి సంఘాలు నిర్మించుకున్నారు. కాని బ్రిటీషు ప్రభుత్వం వాటిని త్వరలోనే నిషేధించింది.

అప్పుడు జాతీయ విద్యార్థి కార్యకర్తలకు కర్తవ్యం గోచరించలేదు. ఉద్యమాల్లోనికి ఉరకటానికి పిలుపునిచ్చి, విద్యార్థి వుద్యమాన్ని క్రమబద్ధమైన పద్ధతిలో, నిర్మాణయుత కార్యక్రమంతో, నడిపించే నాయకులు లేకపోయారు.

## ఆచార్య రంగాగారి నాయకత్వం

ఆచార్య రంగాగారు, విద్యార్థులు సుశిక్షితులుగా సంఘటితపడి, నిర్మాణయుత కార్యక్రమంతో నడుపబడాలని వాంఛిస్తున్నారు. 1927లో పచ్చయప్పాస్ కళాశాల అధ్యాపకులుగా నుంటూనే మద్రాస్‌లో జరిగిన రాష్ట్ర అఖిల భారత విద్యార్థి మహాసభల ఆహ్వాన సంఘాధ్యక్షులుగా పనిచేశారు. 1938 నుండి వివిధ రాష్ట్రాల విద్యార్థి మహాసభలకు అధ్యక్షులుగా ప్రారంభకులుగా వుండి, వారికి సందేశమిచ్చి విద్యార్థి ఉద్యమ కారుల కాశాజ్యోతిగా రూపొందారు. ఆయన జైలులోనుండగా ఆంధ్ర విద్యార్థి నాయకులకు, విద్యార్థి కాంగ్రెస్ స్థాపించుకోమని ఆదేశించారు. 1945వ సంవత్సరంలో బందరులో ప్రథమ ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి కాంగ్రెసు మహాసభలు జరుపుకున్నారు. ఆచార్య రంగాగారే వాటికి ప్రారంభోపన్యాసకులు! అనేక యితర రాష్ట్రాలలో కూడా రంగాగారి నాయకత్వాన విద్యార్థి కాంగ్రెస్ సంఘాలు స్థాపించుకొన్నారు. వారి కృషివల్లనే చివరకు అఖిల భారత విద్యార్థి కాంగ్రెస్ నిర్మాణం కూడా జరిగింది.

ఆంధ్రరాష్ట్రంలో విద్యార్థి కాంగ్రెస్ పౌరసత్వ కళాశాలలు నడిపి విద్యార్థుల బాధ్యత తెలంగింపజేసింది. రైతాంగ రాజకీయ విద్యాలయాలకు విద్యార్థులను బంపి వారి రాజకీయార్థిక సాంఘిక విజ్ఞాన వికాసాలను పెంపొందించింది.

తరువాత నంద్యాలలో, గుంటూరులో, విజయవాడలో వరుసగా ద్వితీయ, తృతీయ చతుర్థ ఆంధ్రరాష్ట్ర విద్యార్థి కాంగ్రెస్ మహాసభలు జరిగినాయి. రాష్ట్రంలోని అన్ని విద్యాలయాలలోను విద్యార్థి కాంగ్రెస్ యూనిట్లు నెలకొల్పబడినవి. పేరు విద్యార్థి కాంగ్రెస్ అయినా, కాంగ్రెస్ సంస్థనుగాని, ప్రభుత్వాలనుగాని, అడుగులకు మడుగులొత్తే విధానం యేనాడూ అవలంబించలేదు. రైతు కూలీ ప్రజా రాజ్యనిర్మాణమే తమ రాజకీయాశయంగా తన నిబంధనావళిలో చేర్చుకున్నది. విద్యార్థి కాంగ్రెస్ ఆంధ్ర విద్యార్థుల ఏకైక ప్రాతినిధ్య సంస్థగా రూపొందింది. ఆంధ్ర విద్యార్థులు విద్యార్థి కాంగ్రెస్ నాయకత్వాన తమ సమస్యల పరిష్కారం కోసం అవసరమైనప్పుడు ప్రభుత్వంవారితోకూడా పోరాడారు. కాని అన్నీ

శాంతియుత మార్గంలోనే! డిటెన్షన్ విధానం రద్దుచేయించటానికి ఆంధ్ర విద్యార్థి కాంగ్రెసు నడిపిన ఉద్యమం మరపురానిది, చేసిన అవిరళకృషి ప్రశంసనీయమైనది.

## విద్యార్థులలో కూడా ముఠా రాజకీయాలు

చివరి దశలో శ్రీ గం. మునిరెడ్డి (ప్రస్తుత మద్రాసు శాసన సభ్యులు) గారు బ్రహ్మాండమైన నిర్మాణాత్మక కృషి సాగించారు. కాని కాంగ్రెస్‌లో ప్రబలిపోయిన ముఠా రాజకీయాలజ్వాలం విద్యార్థి కాంగ్రెస్‌నుకూడా ఆవరించింది. 1951లో రంగాగారు కాంగ్రెస్‌నుండి బయటకు వెళ్లటంతో విద్యార్థి కాంగ్రెస్ చీలిపోయి ఆ కార్యకర్తలే విద్యార్థి సమ్మేళన్ స్థాపించుకొని అవే ఆశయాలతో కృషిసాగించారు. తరువాత శ్రీ కాకాని వెంకటరత్నంగారు, రాష్ట్ర కాంగ్రెస్ ప్రధాన కార్యదర్శులైన పిదప మరల విద్యార్థి కాంగ్రెస్‌ను స్థాపించారు. విద్యార్థి కాంగ్రెస్, విద్యార్థి సమ్మేళన్ రెండూనూ, ప్రజాస్వామ్య వ్యవస్థను రక్షించుకొనే కార్యక్రమంలో తమ వైరుధ్యాలను కట్టిపెట్టి కలసి మెలసి కృషి చేశాయి. యిటీవల రాజకీయ పరిణామాల ఫలితంగా రంగాగారు కాంగ్రెస్‌లో చేరిపోవటంతో విద్యార్థి సమ్మేళన్ కూడా రద్దయింది. ఉత్సాహవంతులైన సమ్మేళన్ కార్యకర్తలంతా విద్యార్థి కాంగ్రెస్‌లో చేరి విద్యార్థి కాంగ్రెస్‌కు తొల్లింటి ప్రతిష్టను చేకూర్చేందుకు చేయి కలిపి కృషి చేస్తున్నారు.

## విద్యార్థుల కర్తవ్యం

ముఠాతత్వాలు ప్రవేశించనీయక విద్యార్థి కాంగ్రెస్ కార్యకర్తలంతా ఐక్యభావంతో పనిచేసి, ఆంధ్రలో మితవాద భావాలకు నిలువు లేకుండా చేయవలసియుంది. కాంగ్రెస్ పెద్దలు సహితం తమలో తమకెన్ని వైమనస్యాలున్నా, వైరుధ్యాలున్నా వాటిని యీ రంగానికి ప్రాకకుండునట్లు చూస్తేనే, విద్యార్థులలో సమిష్టిభావం పెంపొంది భారతదేశ భవిష్యత్తు మరింత శక్తివంతంగా పటిష్టపరచబడగలదు.

# భారత జాతీయోద్యమము....
# ఆంధ్ర నారీమణులు

## శ్రీమతి కొండా పార్వతీదేవి

### భారత స్వాతంత్ర్య పోరాటము

జాతీయోద్యమమన, జాతియొక్క స్వాతంత్ర్యమునకై బయలుదేరిన ఉద్యమము ఇదియొక ప్రత్యేక మతమునకు గాని, రాష్ట్రమునకు గాని, చెందక సమిష్టిగా యావత్ భారత జాతికిని చెందినది. మన భారత దేశమందు ఈ జాతీయోద్యమము హ్యూమ్, నౌరోజీ, గోఖలే, తిలక్, మహాత్మాగాంధీ మొదలగు మహాపురుషులచే నడుపబడినది. అందును పరదేశ పరిపాలనా విముక్తికై నిర్వహింపబడిన ఈ ఉద్యమము గాంధీజీ నాయకత్వమున విజయవంతమైనది. మొదట సంఘోద్యమములు, రాష్ట్రోద్యమములుగా ప్రారంభింపబడి అవియే నానాట విస్తరించి జాతీయ స్వాతంత్ర్యోద్యమముగా పరిణమించినవి. భారతమాత దాస్య శృంఖలములు వీడినగాని భారతజాతి యంతయూ సర్వతోముఖాభివృద్ధి చెంది దేశమందు శాంతి భద్రతలు ఏర్పడి, ప్రజలు సుఖపడజాలరను విశాలభావముతో, అన్ని రాష్ట్రాలవారు తమతమ రాష్ట్రోద్యమములను ఆపి మహాత్మాజీ నాయకత్వముక్రింద సంఘటితపడి బ్రిటీష్ వారితో పోరాటము సాగించి విజయులైరి. ఈ ఉద్యమములో, సాంఘిక, వైజ్ఞానిక, రాజకీయ రంగములందు అసమాన ప్రతిభను, అపార దేశభక్తిని, అపూర్వ కార్యనిర్వహణా నైపుణ్యమును, కలిగిన స్త్రీలు అన్ని సమయములందును పురుషులతో పాటు పాల్గొని తమ శక్తిసామర్థ్యములను ప్రదర్శించియుండిరి.

ఏ జాతియొక్క ఔన్నత్యము కాని, ఆ జాతి స్త్రీల సర్వతోముఖాభివృద్ధిమీదనే ఆధారపడి యున్నదని "యత్ర నార్యస్తు పూజ్యంతే రమంతే తత్ర దేవతాః। యత్రైతాస్తు న పూజ్యంతే సర్వాస్తత్రాఫలాః॥" అను స్మృతివాక్యమువలన మనకు విశదపడును. అంతియగాక ఖండఖండాంతరములందును, స్త్రీల గౌరవమన్ననలు ఆ దేశపు జాతీయ వికాసములకు కారణమగుచున్నవని విదితమగుచున్నది. వేద, పురాణ ఆధునిక యుగములందలి చరిత్రలనుచూడ భారత దేశము ఈ విషయములో ఇతర దేశములతో 'ఏమియూ తీసిపోదని తెలియగలదు.

### పౌరాణిక చారిత్రక యుగములు

పురాణ యుగమున కైక, ద్రౌపది, సత్యభామ మొదలగు నారీమణులు ఆయా సమయములందు రణవిద్యా కౌశలత్వమును ప్రదర్శించియు

చరిత్రకాలమునాటి ఝాన్సీ లక్ష్మీభాయి, జీజియాబేగం, మొదలగు వీరాంగనలు భారతదేశమునకు ఆదర్శనారీమణులుగా వెలయుచున్నారు. అంతియేగాక తమతమ రాష్ట్రస్వాతంత్ర్య రక్షణకై పరరాజులతో యుద్ధములు చేసియూ కడుసమర్థతతో రాష్ట్రపాలనము చేసియూ, కీర్తి గడించిన స్త్రీలు ఆంధ్రదేశము నందునూ అనేకులు గలరు. అట్టి నారీనక్షత్రమండలము చేత భారత గగనము ప్రకాశవంతమైనది. అట్టి పుణ్యాంగనల కీర్తిగానము చేత భారత భవనము ప్రతిధ్వనించినది. అట్టి ఆదర్శ వీర పుత్రికారత్నముల చేత భారత మాత ధన్య అయినది.

వెన్నిచ్చి తిరిగివచ్చిన ఖడ్గతిక్కనను మందలించి, ప్రోత్సహించి తిరిగి రణాంగణమున కంపిన ఆయనసతీమణి చానమ్మయు రెండవ భారతయుద్ధమాయని ప్రఖ్యాతి వడసిన పల్నాటియుద్ధమందు రణమునకు పోవిముఖుడగు బాలచంద్రుని, అనురాగములో క్షణికమైన భోగాన్ని అభిలషించి కర్తవ్యమును మరువరాదని హెచ్చరిక చేసి అతని యుద్ధోన్ముఖుడుగా నొనరించిన వీర పత్ని మాంచాలయు నేటికినీ ఈనాటికీ కీర్తి కాయములతో ప్రకాశించుచున్నారు. అదే సమయమున నాయకురాలని ప్రసిద్ధి వడసిన నాగమ్మ రణక్షేత్రములలో వ్యూహములపై వ్యూహములపన్ని శత్రువుల చెండాడియు, పల్నాటిసీమకు రాణియై చాణక్య రాజనీతితోను, అత్యంతశక్తి సామర్థ్యములతోను రాజ్యమును పాలించి స్త్రీలలోకూడా రణకోవిదులు గలరని ఋజువు చేసినది. కాకతీయసామ్రాజ్ఞియు రాజనీతి, రణనీతులు నేర్చిన సమస్తవిద్యా విశారదయు నగు రుద్రమదేవి శత్రురాజుల తిరుగుబాటులను సాహసముతో నెదుర్కొని దేశమున శాంతిభద్రతల నెలకొల్పి విశాల కాకతీయ సామ్రాజ్యమును పరిపాలించినది.

పై నుదహరించిన వారి చరిత్రలు చూడ పూర్వకాలములందు అనేక యుద్ధములందు స్వాతంత్ర్యరక్షణమునందును అనన్యమగు నైపుణ్యమును ప్రదర్శించిన స్త్రీలు ఇతర రాష్ట్రములందువలెనే మన రాష్ట్రమందునూ గలరని స్పష్టమగుచున్నది. ఇదే విధముగ ఈ యుగమందును మహాత్ముడు నడిపిన భారత జాతీయోద్యమమునందు ఆంధ్రనారీమణులెందరో, పురుషులతో పాటు పాల్గొని తమ అకుంఠిత పరాక్రమమును, అసమాన సహనమును ప్రదర్శించి మహాత్ముని మన్ననలకు పాత్రులైరి.

## గాంధీ యుగము

ఆధునిక యుగమందును, మనజాతి పిత మహాత్మాగాంధీగారు, అనన్యము, అలౌకికము, అసాధారణమునైన అహింసామార్గముతో శాంతిసమరము సాగించినప్పుడు భారతదేశమందు, అసూర్యంపశ్యలై హర్మ్యాంతరములందు సుకుమారులగు సోదరీమణులెందరో పురుషులతో పాటు కారాగారములకేగి, సమ్మెలు, సత్యాగ్రహములు చేసి భీషణమగు ఎండతాపములకైన లెక్కచేయక పికెటింగులు చేసి దారుణమగు కొరడాదెబ్బలను సహితము సహించి, తమ అబలత్వమునకు, తిలాంజలులిచ్చి సబలలమని తమ అసాధారణ చర్యలచేత నిరూపించిరి. శ్రీమతి సరోజినీ, కమలాదేవి, అమృతకౌరు, విజయలక్ష్మి పండిట్ దుర్గాబాయి, మొదలగు నారీరత్నములు మహాత్ముని శంఖారావము వినినంతనే

స్వాతంత్ర్యసంగ్రామమునందుమికి ఖండఖండాం
తరములందును తమకీర్తిచంద్రికలు, వ్యాపిం
పజేసిరి. వివిధ రాష్ట్రముల నారీమణులు
ఏవిధముగ భారతమాత దాస్యవిమోచనకై
త్యాగ మొనర్చి అశేషప్రతిభనుచూపి చిర
స్మరణీయులయ్యిరో, అదేవిధముగ ఆంధ్ర
జనని పుత్రికారత్నములు, అన్ని యుగ
ములందును ఇతర రాష్ట్రములకు తీసిపోని
ప్రజ్ఞాపూర్ణతను అన్ని క్షేత్రములందును
చూపినారు.

1920వ సంవత్సరమున ఆంధ్రదేశమున
జరిగిన జాతీయోద్యమమందు పాల్గొనిన
నారీరత్నములలో అగ్రతాంబూలమునందు
కొనినవారు శ్రీమతులు దువ్వూరి సుబ్బమ్మ,
ఉన్నవ లక్ష్మీబాయమ్మ, భారతీదేవి
రంగా, పొణకా కనకమ్మ, దుర్గాబాయి
దేశముఖ్, అమ్మన్నరాజా, ఓరుగంటి
మహాలక్ష్మమ్మ, మూలగ్వారి చుక్కమ్మ
గార్లు మొదలగువారెందరో గలరు.

ఈ జాతీయోద్యమమునందు స్త్రీలలో
విజ్ఞానము వ్యాపించినది. స్వదేశవస్తువుల
యందు, కుటీరపరిశ్రమలయందు అభిరుచి
హెచ్చినది. మనదేశమునందు వివిధ ప్రాం
తములలో ఈ ఆధునికయుగమున ఏ స్త్రీ
సంఘమైన ప్రారంభింపబడినదనిన, జాతీ
యోద్యమఫలితమేనని చెప్పవలసియున్నది.
స్త్రీలు పూర్ణస్వాతంత్ర్యమును, ప్రస్తుత
స్థితిని, తెలిసికొనగలిగిరి. సాంఘిక, ఆర్థిక,
రాజకీయ, క్షేత్రములలో పురుషులతో
పాటు స్త్రీలకును సమాన హక్కులు
కలుగజేయుమని పోరాటము సాగించిరి.
కేంద్ర, రాష్ట్ర, శాసన సభలలో స్త్రీలకు
ప్రత్యేక నియోజకవర్గములు అవసరములే
దనియు, శక్తిసామర్థ్యములనుబట్టి పురుషు
లతోబాటు పాల్గొనెదమనియు, ఓటు
అధికారము వయస్సును బట్టి ఉండవలె
ననియు ఆందోళన సాగించిరి. మహాత్మునిచే
నడుపబడిన జాతీయోద్యమము, భారతదేశ
స్త్రీలను ఇతరదేశ స్త్రీలతోపాటు నాగ
రికతగలవారినిగా నొనర్చె. దేశాభ్యుదయ
మునకై పాటుబడగల శక్తివంతులుగా
నొనర్చినది. యావద్భారతమందును ఖండాం
తరములందును శ్రేష్టులగు నారీమణు లాచ
రించిన మార్గములననుసరించి, భారతసోదరీ
మణులుగూడ ధన్యచరిత లయ్యెదరుగాక.




## శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మ

భారత స్వాతంత్ర్య సమరంలో ఝాన్సీలక్ష్మీబాయికి తరువాత విప్లవోద్యమంలో పాల్గొనిన స్త్రీలు కాన్పించరు. హింసాయుతమైన ఆనాటి విప్లవంలో స్త్రీలకు అంతగా స్థానం లేకపోయింది. కాని మహాత్మా గాంధీచే సాగింపబడిన సహాయ నిరాకరణోద్యమము ప్రారంభము కాగానే స్త్రీలు అందు చేరుటకు మంచి అవకాశం కలిగింది. మహాత్ముని ఉద్యమం దౌర్జన్య విరహితము సత్య అహింసాయుతము కావడమే దీనికి కారణం. మహనీయమైన ఈ ఉద్యమం భారతదేశంలోని పల్లీ పట్టణము లంతటను వ్యాప్తమై సమస్త ప్రజానీకాన్ని ఆకర్షింప గలిగింది.

ఇది ఆంధ్ర నారీలోకమును గూడా అపూర్వంగా మేలుకొలిపింది ఆంధ్రమహిళలు ఏ ఉద్యమమునందైనను ముందంజ వేయుగల స్వభావము కలవారు. ఒకప్పుడు బౌద్ధ జైనాది మతములు ఆంధ్రావనిని ఆవరించినప్పుడు ఆంధ్ర స్త్రీలెందరో అందు పాల్గొని మత వ్యాప్తికి ఎంత దోహద మొనర్చినది ఆంధ్రచరిత్ర పాఠకులకు తెలియని విషయము కాదు. రాజ్యనిర్మాణమునందేమి, రాజ్యపరిపాలనయందేమి, యుద్ధకార్యములందేమి సారస్వత సాంఘికాది విషయములందేమి, ఆంధ్ర యువతుల కౌశలము యేనాడును వెనుకపడి యుండలేదు. బొబ్బిలి మల్లమ్మ ఆత్మార్పణము రాజపుత్ర స్త్రీల జోహారులకు తీసిపోయినది కాదుగదా. ఇట్టి సర్వతోముఖ ప్రజ్ఞగల తెలుగు నెలతలు మహాత్ముని శాంతి సమరమున చేరకుండ నెట్లుండ గలరు? ఏనాడు మహాత్మాగాంధీ కాంగ్రెసు సారథ్యమువహించి (1921 లో) బెజవాడయందు కాంగ్రెసు కార్యవర్గమును సమావేశ పరచి కాంగ్రెసుకు కోటి మంది సభ్యులు, కోటిరూప్యముల నిధి, ఇరువది లక్షలు రాట్నములు అను తీర్మానమును గావించి ఈ తీర్మానమును ఆచరణయందు పెట్టుటకు ప్రప్రథమంగా ఆంధ్ర దేశమున పర్యటన గావించెనో, ఆనాడే ఆంధ్ర స్త్రీలు ఆ ఉద్యమానికి జేజేలు పట్టిరి. తిలకు స్వరాజ్యనిధికి మొట్టమొదట తమ అమూల్య స్వర్ణాభరణములు దాన మొనర్చిన త్యాగశీలలు ఆంధ్ర మహిళలే! భర్త విదేశమున నుండగా మాగంటి బాపినీడుగారి సతి అన్నపూర్ణాదేవి స్వాతంత్ర్యోద్యమమునకు తన్ను సమర్పించుకొన్నది. ఆసమయమునవే మహాత్ముని ఆంధ్రదేశ పర్యటన

ఆంధ్ర స్త్రీలలో మంచి ఉద్బోధకు కారణమైంది. ఆయన విడిసిన ప్రతిపూరునందూ ఆంధ్ర స్త్రీలు తమ నగలు నిధికి కానుకగా సమర్పించి, జాతీయ ఉద్యమమునందు తమకుగల అభిమానమును క్రియారూపకంగా వెల్లడించి మహాత్ముడు విస్మితుడయ్యేటట్లు చేసిరి. పల్నాటి సీమలో శాసనధిక్కారంచేసి సంవత్సరం కారాగృహ శిక్షకు పాత్రుడైన భర్తను పూలదండలతో వీడుకొలిపి భర్త నడిపిన ఉద్యమభారాన్ని తనపై వేసుకొన్న వీరవారి ఉన్నవ లక్ష్మీబాయమ్మ. ఆమె భర్త చెఱసాలకేగినది మొదలు గ్రామగ్రామము తిరుగుచు, యిల్లువెడలి యెరుగని గ్రామీణ స్త్రీల నెందరినో ఉద్యమంలోకి ఆకర్షింపకలిగారు. గుంటూరుజిల్లాలో పేరుమోసిన కమ్మవారింటి స్త్రీలు ఎందరో శ్రీ లక్ష్మీబాయమ్మగారి కృషిఫలితంగా ఉద్యమంలో చేరి విదేశవస్త్ర బహిష్కారము, మద్యపాన నిషేధము అస్పృశ్యతానివారణము హిందూ, ముస్లిము ఐకమత్యము మొదలైన కార్యక్రమాల్లో పనిచేసి జైళ్ళకు వెళ్లారు. గుంటూరు జిల్లాలో లక్ష్మీబాయమ్మగారు స్త్రీలలో కావించిన ప్రబోధము విస్మరింపరానిది. గుంటూరుజిల్లాలో స్త్రీల అసహాయోద్యమ ప్రచారానికి శ్రీ లక్ష్మీబాయమ్మగారు తలమానికమైనట్టుగానే పశ్చిమ గోదావరిజిల్లాలో అన్నపూర్ణాదేవి అగ్రగణ్యమైనది. ఆమె బెజవాడలో మహాత్ముని దర్శనముచేసి రాజకీయములలో ప్రాల్గొనుటకు ప్రతిన తీసుకొన్నది మొదలు అవిరామ కృషిసలిపి ఆ జిల్లాలో మహిళలను ప్రబోధింపగలిగింది. ఈమెతో బాటుగా యీమె జనని కలగర పిచ్చమ్మగారు, మూల్పూరు చుక్కమ్మగారు, సత్తిరాజు శ్యామలాంబగారు ఉద్యమ వ్యాప్తికి అఖండ కృషిచేశారు.

తూర్పుగోదావరి జిల్లాలో నిరాకరణోద్యమానికి ప్రప్రథమంగా స్వాగతమిచ్చిన వారి రత్నము దువ్వూరి సుబ్బమ్మగారు. గంభీరమైనవాక్కు, అసదృశమైన సాహిత్య పటిమ, శ్రావ్యమైన కంఠము, అసాధారణమైన ప్రసంగ కౌశలము, దైవికముగా లభ్యమైన విదుషీమణి శ్రీమతి సుబ్బమ్మ గారు. దేశభక్తి పూరితమైన భావోద్వేగంతో ఆనాటి జాతీయోద్యమాన్ని గురించి కవివరేణ్యులు వ్రాసిన పద్యాలు, గేయాలు, ఆమెకు కంఠస్థం. దీనికి భారత భాగవతాది పురాణాలలోని కథలు, పద్యాలు, జోడించి ఆమె ఉపన్యసిస్తూ ఉంటే హరికథో పురాణమో విన్నట్లుగా ప్రజలు ఆనందించేవాళ్లు. పురాణ కథలతో రాజకీయాలు మేళవించి ఆమె చేసే ఉపన్యాసానికి వేలాది ప్రజలు గుమికూడేవారు. ఆనాడు పురుషులలో ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి ఉపన్యాసానికి, స్త్రీలలో దువ్వూరి సుబ్బమ్మగారి ఉపన్యాసానికి ప్రత్యేక ప్రాముఖ్యం ఉండేది. కావుననే ఎవరికీ లేని "దేశబాంధవి" అన్న బిరుదుతో ప్రజలు ఆమెను సంభావించారు. ఆమె తరువాత ప్రఖ్యాత రాజకీయోద్యమనాయకులును, సీతానగరం సత్యాగ్రహాశ్రమస్థాపకులును అయిన డాక్టరు బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యంగారి తల్లి లక్ష్మీనరసమ్మగారు కూడా చక్కని గేయాలు పాడుతూ ఆనాడు ఖాదీ ప్రచారం చేసేవారు. ఖద్దరు ప్రచారంలో ఆమె అందెవేశినచేయి.

రంగేలసే నీకు రంగమ్మ వదినె
రంగు చీరలున్నన్ని భంగపుచ్చినావి
ఖద్దరు ఖద్దరని గాంధి మహాత్ముండు
పదివేల సారులు పలికినాడతడు.
పలికినాడేగాని పాటించలేదు మనం

యీ మాదిరిగా ఎవరింటికి వెళ్లితే ఆ యింటి యిల్లాలు చేరువెట్టి పాటలు పాడి ఖద్దరు కట్టుకోవలసిందని ఆమె నచ్చచెప్పుతూ ఉండేవారు. ఎనుబదవపడిలో ఆమె చేసిన అసహాయోద్యమ ప్రచారము ఉద్యమానికెంతో బలం చేకూర్చింది. రాజమహేంద్రవరంలో ఆనాడు ఉద్యమవ్యాప్తికి ప్రచారం చేసిన వారిలో దువ్వూరి సుబ్బమ్మ, బ్రహ్మజోస్యుల లక్ష్మీనరసమ్మ గార్లతోపాటు ప్రచారం చేసిన యువతి పెద్దాడ కామేశ్వరమ్మ గారు, ఆమె బి. ఎ. ప్యాసై ఉద్యోగ రజ్జువులలో నిబద్ధురాలు కాకుండా రాజకీయోద్యమంలో అమోఘంగా పనిజేసింది.

ఈనాడు బి. ఏ, బియల్. పరీక్షలో ఉత్తీర్ణురాలై లాయరై మద్రాసులో ఆంధ్ర మహిళాసభ స్థాపకురాలై, పార్లమెంటు మెంబరై, ప్లానింగు కమీషన్ సభ్యురాలై కేంద్ర ఆర్థికమంత్రి చింతామణి దేశముఖు యిల్లాలై, అఖిల భారతి సాంఘిక సంక్షేమ సంఘాధ్యక్షురాలై భారతి మహిళాభ్యుదయానికి కోట్ల ధనమును చేతులార వెచ్చించుచున్న శ్రీ దుర్గాబాయిగారు, ఆనాడు ఏమీరాని, ఏమీయెరుగని. ఎ. బి. సి. డిల ముఖమే తెలియని ఇరువదేండ్లు నిండీ నిండని ముద్దరాలు. మహాత్ముని ప్రబోధము ఆమెను నిరాకరణోద్యమములో పనిచేయుటకు ఉద్యుక్తురాలిని చేయడమే గాదు, ఆమెలో నిగూఢంగా నిక్షిప్తమైయున్న అపూర్వ అసాధారణ మహత్తర శక్తులనే కము బహిర్గతమగుటకు కారణభూతమైంది. ఈమె అసహాయోద్యమములో చేరి అసదృశంగా పనిచేయడమే గాదు, సైమను సంఘ బహిష్కార సమయములో త్రివర్ణ పతాకధారియై పోలీసులను ఎదుర్కొనిన ధీరురాలు. విశాఖపట్నములో శ్రీమతి దిగుమర్తి జానకీబాయిగారు మున్నగువారు అసహాయోద్యమానికి వెలలేని పనిచేసి యశోవిశాలలైనారు. గంజాం జిల్లాలో వరహాగిరి వారింట బుట్టిన లక్ష్మీబాయమ్మగారు, జయంతి సూరమ్మగారు చేసినకృషి యెనలేనిది. నెల్లూరులో పోణకా కనకమ్మగారు ఆమె మిత్రురాలు ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మ గారు అసహాయోద్యమ వ్యాప్తికి సాటిలేని పని చేశారు. పల్లిపాడు సత్యాగ్రహ శ్రమవాసినిగా ఉండిన దిగుమర్తి బుచ్చికృష్ణమ్మగారు మున్నగువారు గూడా ఆనాటి ఉద్యమములో తీవ్రముగా పనిజేసిన యోధురాండ్రే.

మద్రాసు పేరు తలపగనే ఆచంట రుక్మిణమ్మగారి పేరు మనముందు స్ఫురణకు వస్తుంది. ఆమె రాజధానీ నగరమున ఉద్యమ వ్యాప్తికి జేసిన సేవ అపారము. యామినీ పూర్ణ తిలకమ్మగారి కృషికిగూడ చాలావరకు మద్రాసే రంగస్థలము. ఈ విధంగా అనేకమంది సోదరీమణులు అసహాయోద్యమపు తొలిఘట్టంలోనే కార్యరంగంలో ప్రవేశించి జైళ్లకువెళ్లి అనేక కష్టనష్టాలకు గురైనారు.

మహాత్ముని యాజమాన్యమున జరిగిన భారత స్వాతంత్ర్యోద్యమమును మూడు ఘట్టాలుగా వర్ణింపవచ్చును. తొలిఘట్టం సహాయనిరాకరణోద్యమం, రెండవది లవణ సత్యాగ్రహం, మూడవది క్విట్ ఇండియా ఉద్యమం. ఈ ఉద్యమంలో మొదటిదాని

కంటె రెండవ ఉద్యమంలోను, రెండవ ఉద్యమంలో కంటె మూడవ ఉద్యమం లోను ఆంధ్ర స్త్రీలు అత్యధికంగా చేరి పనిచేసి స్వరాజ్య సిద్ధికి తోడ్పడ్డారు.

ఈ ఉద్యమ సహాయాల్లో ఒకమారు కంటె మరొకమారు అత్యధికంగా పాల్గొని ఆంధ్ర స్త్రీలు చేసిన విశేషకృషికంటె ఉద్యమానికి ఉద్యమానికి మధ్య కలిగిన విరామ దశలో వారు చేసిన కృషి మరింత ప్రశంసనీయంగా ఉన్నది. ఉద్యమానుభవమువల్ల వారికి కలిగిన రాజకీయ పరిజ్ఞానమును, జాతీయాభిమానమును, దేశభక్తిని, సేవాశక్తిని, కార్యదక్షతను, పురస్కరించుకొని నిర్మాణాత్మకమైన పనికి వారు పూనుకొన్నారు. మహాత్ముని నిరంతర బోధ వారిని స్థిరమైన పనికి పూనుకొనునట్లు చేసినది.

ఉద్యమములు ప్రవాహ వేగసాల్యమైనవి. వేగముతో వచ్చిన వెల్లువలు వేగముతో ఎట్లు తీసిపోవునో అట్లే సాంఘికంగా గాని రాజకీయంగా గాని మరేవిధంగా గాని వచ్చే ఉద్యమాలు కూడా అతివేగంగా వచ్చి అతివేగంగా తగ్గిపోవడం జరుగుతూ ఉంటుంది. అయితే వెల్లువ తీసిపోయినా ఆ వెల్లువలో కొట్టుకువచ్చిన ఒండ్రుమట్టి మొదలైనవి అచ్చటచ్చట నిలిచిపోయి క్రొత్త క్రొత్త పంటల ఉత్పత్తికి అధికంగా పండటానికి సహాయభూతములైనట్లుగానే ఉద్యమ సమయాల్లో ప్రజాహృదయాల్లో నాటుకొన్న జాతీయ భావాలు వారిలో నిలిచిపోయి ఇతర ప్రజాహిత కార్యములకు దోహదమవుతూ ఉంటవి. నిరాకరణోద్యమంలో పనిచేసిన కారణంగా కలిగిన అనుభవము ఆంధ్ర నారీ హృదయంలో కూడా యిట్టి సత్సంకల్పాన్నే అంకురింప చేసింది. ఆనాటి విదేశ ప్రభుత్వ ప్రాభల్యంవల్ల విజాతీయ వేషభాషలకు నాగరికతకు సమ్మోహితులైన యువతీ లోకంలో జాతీయ భావాన్ని అంకురింపచేయడం అత్యంతావశ్యకంగా వారికితోచింది. స్త్రీలను కని, పెంచి జాతికి జవము జీవము పోయవలసిన యువతీ హృదయాల్లో, పాశ్చాత్య నాగరికతానుకరణము ప్రమాదకరమనీ, జాతికి నష్టదాయకమనీ వారు గ్రహించారు. కనుక జాతీయ విద్యాసంస్థల ద్వారా బాలికల లేతహృదయాల్లో జాతీయాభిమానమును నెలకొల్పుటకు పూనుకున్నారు. మహాత్ముడు ఈ సత్ప్రయత్నాన్ని ఆశీర్వదించారు. సత్యాగ్రహ సమరంలో కాకలుదీరిన ఆంధ్ర యోధురాండ్రు వెంటనే ఈ కార్యక్రమమునకు పూనుకున్నారు. శ్రీమతి ఉన్నవ లక్ష్మీబాయమ్మగారి ఆధ్వర్యాన గుంటూరులో శారదానికేతము స్థాపితమైంది. దువ్వూరి సుబ్బమ్మగారి యాజమాన్యాన రాజమండ్రిలో స్త్రీ సనాతన విద్యాలయం వెలసింది. నెల్లూరులో పొణకా కనకమ్మగారి ఆధిపత్యాన కస్తూరిబా జాతీయ విద్యాలయం నెలకొల్పబడింది. గుమ్మడిదల దుర్గాబాయమ్మగారిచే ఆంధ్ర మహిళాసభ అను మహా సంస్థ సృష్టింపబడింది. కాకినాడలో బాలాంత్రపు శేషమ్మగారివల్ల మహిళా విద్యాలయం స్థాపింపబడింది. మద్రాసులో యామినీ పూర్ణతిలకమ్మగారు మరొక స్త్రీ విద్యా సంస్థను నడిపారు. ఈ సంస్థకు ప్రభుత్వము వారి ఆమోదములేదు. గ్రాంటులులేవు. దేశీయ విద్యలకు కళలకు తావలములైన యీ సంస్థలు ప్రజల చేతనే పోషితములై బాలికలలో జాతీయతా వికాసానికి అత్యధికంగా తోడ్పడినవి.

ఈ పాఠశాలలతోబాటు అఖిల భారత మహిళాసంఘ పక్షమున జరిగిన రాష్ట్రీయ, జిల్లా, తాలూకా, సభలును తదితర మహా

సభలను ఆంధ్రదేశమున స్త్రీల జాతీయతా వ్యాప్తికి విశేషముగా సహాయ పడినవి. ముఖ్యముగా రాజకీయములలో పనిచేసిన వారే వీనియందును అధికముగా పనిచేయ కలిగారు.

భర్త ఉద్యోగ కారణం వల్లనో, లేక తమకే ఉద్యోగం ఉండటంవల్లనో రాజకీయాల్లో ప్రత్యక్షంగా పాల్గొని జైళ్లకు వెళ్లకపోయినా దీక్షగా ఖద్దరు కట్టడంలో నేమి, కాంగ్రెసు సిద్ధాంతాలను 'తూచా' తప్పకుండా ఆచరణలో పెట్టడంలో నేమి, దేశ విషయాలను క్షుణ్ణంగా తెలుసుకొని దేశాభిమానపూరితులై ఉండటంలో నేమి కాంగ్రెసు అనుయాయులకు తీసిపోని స్త్రీలుకూడా అసంఖ్యాకంగా ఉన్నారు. నిజం చెప్పతలచుకుంటే ప్రత్యక్ష కాంగ్రెసు వాదులకంటె, మానసికంగా జీవితమును దేశానికంకితం చేసినవారు స్త్రీలలోనే అత్యధికంగా ఉన్నారని చెప్పవలసి ఉంటుంది. గుప్తమైన వీరి మద్దతు లేక పోతే కాంగ్రెసు రాజకీయాలు ఇంత బహుళంగా వ్యాప్తిలోకి వచ్చేవి కావనే చెప్పాలి.

మహాత్మా గాంధీ అసహాయోద్యమం ఆరంభించిన మొదలు స్వరాజ్య ప్రాప్తి వరకు ఇంచుమించు యిరువదైదు సంవత్సరాలలోను, ఆంధ్ర స్త్రీలు సర్వవిధముల ఉన్నతికి వచ్చారు. ప్రతి ప్రజాహిత ఉద్యమంలోను పాల్గొన్నారు. హరిజనోద్యమంలో చేరి హరిజన పాఠశాల వసతి గృహాలు నడిపారు. శ్రీమతి కొల్లా కనకవల్లి తాయారమ్మగారిచే స్థాపితమైన శ్రద్ధానంద హరిజన పాఠశాల ఒక 'మహాపెద్ద' సంస్థయై దినదినాభివృద్ధి గాంచినది. ఎందరో యువతులకు విద్య గరపుచున్నది. హరిజన స్త్రీలు వేముల శ్యామలాంబగారు, వాగ రత్నమ్మగారు, సుందరమ్మ మున్నగువారు ఈ ఉద్యమ ఫలితంగా పైకి వచ్చినవారే. కాంగ్రెసు ఉద్యమంతో బాటు కృషికోద్యమమును తోడుచేసుకొని శ్రీమతి భారతీరంగా గ్రామసీమలలో ఎనలేని ప్రబోధం చేశారు. గానకోకిల వాసిరెడ్డి హనుమాయమ్మగారు స్వరాజ్య గీతములు పాడుటలోను స్వరాజ్యపు సోదిచెప్పుటలోను ప్రత్యేక గౌరవం సంపాదించారు. శ్రీమతి ఆచంట రుక్మిణమ్మ ఆరోగ్యశాఖా మంత్రిణియై చక్కని పరిపాలనా దక్షత చూపించారు. శ్రీమతి అమ్మన్నరాజా గారు మద్రాసు శాసనసభ ఉపాధ్యక్షురాలుగా ఉండి కీర్తిగడించారు. చుండూరి రత్నమ్మ గారు ఏలూరు మునిసిపల్ చైర్మన్ గా ఉండి నిపుణత చూపిస్తే, కడప రామసుబ్బయ్య గారు కడప జిల్లాబోర్డు అధ్యక్షురాలై ఎంతో సమర్థత చూపారు. స్థానిక సంస్థలలో నేమి తదితర ప్రజాహిత సంస్థలలో నేమి, స్త్రీలు పాల్గొనని సంస్థయే లేదని చెప్పవచ్చును. స్వరాజ్యసిద్ధి అనంతరము స్వతంత్ర భారత విషయాలలో ఆంధ్ర స్త్రీలు ఎట్లు పాల్గొంటున్నారో, ఆంధ్ర రాష్ట్ర అవతరణానంతరము ఆంధ్రరాష్ట్రాభివృద్ధికిని ఆంధ్రస్త్రీలు అగ్రే సహకరిస్తున్నారు. అఖిల భారత సంఘ సంక్షేమ శాఖ ప్రారంభమైన తరువాత ఆంధ్ర స్త్రీలు ఆ సంఘ పక్షమున స్థాపితమైన అసంఖ్యాక సంస్థలకు ఆధిపత్యము వహించి దక్షతతో నిర్వహిస్తున్నారు. శ్రీమతి ఎ. సి. చెన్న ఘంటమ్మ గారు ఆంధ్ర రాష్ట్ర స్త్రీల సంక్షేమబోర్డు సలహాసంఘ అధ్యక్షురాలుగా ఉండి ఆంధ్రదేశమందంతటను చేస్తున్న సేవ నిరుపమానమైనది. శ్రీమతి

భారత దేశపు ఉత్తమమైన




# కూర్గుతేనె

(రిజిష్టర్డు)

ను మీరు వాడండి!

ఆధునిక ఆరోగ్య పద్ధతులలో పాక్ చేయ బడిన శ్రేష్ఠమగు ఆహారము.

ఉత్పత్తి: దీ కూర్గు హనీ & వాక్సు ప్రొడ్యుసర్సు కోఆపరేటివ్ సొసైటీ లి., విరాజపేట, కూర్గు.




ఏజెంట్సు: **పద్మా ఏజన్సీస్** గుంటూరు ఆంధ్ర

---

# "ఎవరెస్ట్"




"ఆస్ బెస్టాస్ సిమెంట్" "ట్రాఫోర్డ్ షీట్సు మరియు "బిగ్ సిక్స్" షీట్సు మీ ఇంటి వాటా కప్పులకు



సులభంగా బిగించ వచ్చును — చూచుటకు సొంపుగానుండును — తరుగుబడికి సరసమైనది — అనవసరపు ఖర్చులు లేకయే చాలకాలముండును.

ఆస్ బెస్టాస్ సిమెంట్ లిమిటెడ్ వారిచే ఇండియాలో తయారు చేయ బడుచున్నది.

దొరకు చోట్లు:

## గుంటూరు సుబ్రహ్మణ్యం & సన్

అగ్రహారం, గుంటూరు.

Ad. I Telugu

బిగ్ సిక్స్ చ. అ. 0-8-7, ట్రాఫోర్డ్ చ. అ. 0-8-3, క్లాన్సెట్ చ. అ. 0-7-11, సూపర్ లైన్ టైల్ చ. అ. 0-7-8, సాదా రేకు చ. అ. 0-6-7.

సిమెంటు పైపులు, జాయింట్సు దొరకును.

# ఆంధ్ర కాంగ్రెస్ నిర్మాతలు

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘము యిప్పటికి 38 సంవత్సరముల క్రిందట స్థాపించబడినది. అంతకు పూర్వమీ సంఘము మద్రాసురాష్ట్ర సంఘములో ఇమిడియుండెడిది. కాంగ్రెసు సంఘము భారతదేశమున స్థాపింపబడిన పిమ్మట చిరకాలం దేశమునందలి అనధికార వ్యక్తులు మాత్రమే ఈ రాజకీయ వ్యవహారములందు జోక్యము కలిగించుకొనెడివారు. సామాన్య జనులలో రాజకీయ విద్యావిషయక చైతన్యములు మిక్కిలి తక్కువగా నుండెడివి.

ఇట్టి పరిస్థితులలో వంగదేశమున వందేమాతరం ఉద్యమము ప్రబలి దేశమునందలి అన్ని ప్రాంతములకు విస్తరిల్లినది. కాంగ్రెసువారు దీనిని ప్రచారము చేయుట ప్రారంభించిరి. ఇట్లుండ అఖిల భారత కాంగ్రెసు మహాసభ సూరతునందు జరుపబడినది. తరువాత కొద్దికాలమునకే ఆంధ్రదేశమున ఆంధ్రోద్యమము కూడ ప్రారంభింపబడెను. దానినిగూర్చి నాయకులు ఆంధ్రదేశమందంతటను ప్రచారము చేసి జనులలో కొంత రాజకీయ జిజ్ఞాసను రేకెత్తించిరి.

తరువాత బొంబాయి నగరమున సిన్హాగారి అధ్యక్షతన జరిగిన కాంగ్రెసు మహాసభకు ఆంధ్రదేశమునుండి ప్రముఖులనేకులు ప్రతినిధులుగా వెళ్లియుండిరి. ఆ సభలో ఆంధ్రులను, ఆంధ్రులుగా గుర్తింపకుండుట ఒక లోపముగా నాటి నాయకులు తలచి, బొంబాయి సభనుండి తిరిగి వచ్చిన పిదప మనఆంధ్రులకు ఒక ప్రత్యేక రాష్ట్రకాంగ్రెసు సంఘము కావలెననెడి వాంఛను ప్రజలలో ప్రబోధించిరి. దానికై మంచి పట్టుదలతో పనిచేయ ప్రారంభించిరి. తిరిగి 1916వ సంవత్సరమున లక్నో పట్టణమున కీ. శే. అంబికాచరణ్ మజుందార్ అధ్యక్షతన జరుగుచున్న, అఖిల భారత కాంగ్రెసు మహాసభలలో ప్రత్యేక కాంగ్రెసు సంఘము ఆంధ్రులకివ్వమని కోరుచూ పలువురు నాయకుల సంతకములతో కూడిన ఒక పత్రమును కీ. శే. కొండా వెంకటప్పయ్య పంతులుగారి నాయకత్వమున అఖిల భారత కాంగ్రెసు కార్యదర్శి అయిన కీ. శే. న్యాపతి సుబ్బారావు పంతులుగారికి సమర్పింపబడినది.

తదుపరి కలకత్తాలో 1917వ సంవత్సరమున శ్రీ కీ. శే. అనీబిసెంటుగారి అధ్యక్షతన జరిగిన అఖిల భారత కాంగ్రెసు సభలలో భాషాప్రయుక్త రాష్ట్రసిద్ధాంతమంగీకరించబడిన కారణంగా ఆంధ్రదేశమునకు ఒక ప్రత్యేక రాష్ట్ర కాంగ్రెసు సంఘము కీ. శే. న్యాపతి సుబ్బారావు పంతులుగారు అధ్యక్షులుగను, కీ. శే. కొండా వెంకటప్పయ్య పంతులు, శ్రీ విష్ణుభొట్ల సూర్యనారాయణ గారలు కార్యదర్శులుగాను స్థాపించబడినది. ఈ సంఘమునకు గుంటూరే ముఖ్యస్థానముగా నుండెడిది. నేటివరకు వరుసగా అనేకమంది నాయకుల అధ్యక్షతన ఈ రాష్ట్ర కాంగ్రెసు సంఘము దినదినాభివృద్ధి పొందుచూ భారత రాజకీయాలలో అగ్రస్థానము వహించుచున్నది. నేడు దీని కార్యాలయము విజయవాడయందలి "ఆంధ్రరత్న భవనము"

—[ వి. సూర్యనారాయణ బి.ఎ., బి.యల్., ]

# ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షులు

## కీ॥ శే॥ న్యాపతి సుబ్బారావు

కొంతకాలం అఖిల భారత కాంగ్రెసు కార్యదర్శిగా పనిచేశారు. వీరి పట్టుదల ప్రయత్నాల వల్లనే ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘము ప్రభవించినది.

## కీ॥ శే॥ దేశభక్త కొండా వెంకటప్పయ్యపంతులు

శ్రీ చిత్తరంజన్‌దాస్ రాజీనామా యిచ్చిన కారణంగా అఖిలభారత కాంగ్రెసు సంఘాధ్యక్షులుగా కొంతకాలంపని చేశారు. ఈ అధ్యక్ష కాలంలోనే కాకినాడ మహాసభను నిర్వహించారు. అఖిలభారత దృష్టి నాకర్షించిన పెదనందిపాడు పన్నుల నిరాకరణోద్యమము, పల్నాటి అటవీ సత్యాగ్రహము, అఖిల భారత ఖాదీబోర్డు స్థాపన వీరి అధ్యక్ష కాలంలోనే జరిగెను.

## కీ॥ శే॥ దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుపంతులు

వీరి అధ్యక్ష కాలంలో ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కార్యాలయము విజయవాడ యందు నిర్మించబడెను. అప్పుడే సైమన్ కమీషన్ ఉద్యమము ఆంధ్రలో నిర్విఘ్నముగా కొనసాగించబడినది.

## శ్రీ ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశంపంతులు

సైమన్ కమిషన్ బహిష్కరణ సందర్భములో వీరి చర్యలు చరిత్రాత్మకములై ఆంధ్రరాష్ట్రమునకు కీర్తిని, వారికి "ఆంధ్రకేసరి" అను బిరుదును గడించి పెట్టినది. 'స్వరాజ్య' పత్రిక స్థాపించి ఆంధ్ర ప్రజలలో రాజకీయ చైతన్యము కలిగించిరి. కాంగ్రెసువారు శాసన సభలలో ప్రవేశింప నిర్ణయించి మద్రాసు శాసనసభకు పోటీచేసిన సందర్భములో ఆంధ్రలో కాంగ్రెసుకు దిగ్విజయము చేకూర్చిరి. ఆంధ్రరాష్ట్ర ప్రప్రథమ ముఖ్యమంత్రి.

## శ్రీ డాక్టరు భోగరాజు పట్టాభిసీతారామయ్య

అఖిలభారత కాంగ్రెసు చరిత్ర రచయిత. మహాత్మాగాంధీ సూత్రభాష్యకారుడు. భాషాప్రయుక్త రాష్ట్రవిభజన సంఘాధ్యక్షులుగా ఉండి ఆంధ్రరాష్ట్రోద్యమానికి దోహదం చేశారు. అనేక సంవత్సరాలు అఖిలభారత కాంగ్రెసు కార్యవర్గ సభ్యులుగా ఉండి, అఖిలభారత కాంగ్రెసు అధ్యక్షపదవిని అలంకరించారు. ప్రస్తుతం మధ్యప్రదేశ్ గవర్నరు.

## శ్రీ మహర్షి బులుసు సాంబమూర్తి

కాకినాడలో జరిగిన అఖిల భారత కాంగ్రెసు మహాసభల ఆహ్వాన సంఘాధ్యక్షులు. 1937లో ఏర్పడిన మద్రాసు శాసన సభాధ్యక్షులు.

## శ్రీ ఆచార్య గోగినేని రంగనాయకులు

వీరి అధ్యక్ష కాలంలోనే భారత దేశమునకు స్వాతంత్ర్యమేర్పడినది. రాష్ట్ర కాంగ్రెసుకు అనుబంధములుగా వివిధ రంగములలో సంఘముల స్థాపించి గ్రామసీమలలో కాంగ్రెసు పలుకుబడిని ఇనుమడింపజేసిరి. అఖిలభారత రైతు కాంగ్రెసు సంఘ స్థాపకులు.

### శ్రీ నీలం సంజీవరెడ్డి

వీరి అధ్యక్షకాలంలో ఆంధ్రుల చిరకాల వాంఛితమైన రాష్ట్రం సిద్ధించింది. దీనికి వీరి శ్రద్ధాభక్తులు, అవిరళ దీక్షలే కారణములు.

### శ్రీ బెజవాడ గోపాలరెడ్డి

ఇదివరలో కాంగ్రెసునుండి చీలిపోయిన ఆంధ్రనాయకులందరిని తిరిగి ఆహ్వానించి ప్రజలలో కాంగ్రెసు ప్రతిష్ట ఇనుమడింపచేసి, ఈమధ్య జరిగిన ఆంధ్ర ఎన్నికలలో కాంగ్రెసుకు ఘనవిజయము చేకూర్చిరి. ప్రస్తుత ఆంధ్రరాష్ట్ర మంత్రి వర్గాధ్యక్షులు.

### శ్రీ అల్లూరి సత్యనారాయణరాజు

ప్రస్తుత రాజ్యసభసభ్యులు. ముక్కోటి ఆంధ్రుల చిరకాల వాంఛితమైన విశాలాంధ్ర సాధనకు నిర్విరామ కృషిసల్పుతున్నారు. శ్రీ రంగా, సంజీవరెడ్డిగార్ల కాలములో సాధించిన స్వరాజ్య, స్వరాష్ట్రములతో పాటు, వీరి అధ్యక్షకాలములో విశాలాంధ్ర ఏర్పడగలదని ఆశిస్తాము.

# ప్రస్తుత రాష్ట్ర కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గము

అధ్యక్షులు :

శ్రీ అల్లూరి సత్యనారాయణరాజు యం. పి.

ఉపాధ్యక్షులు :

శ్రీ యస్. బి. పి. పట్టాభిరామారావు యం. యల్. ఎ.

శ్రీ ఎ. సి. సుబ్బారెడ్డి యం. ఎల్. ఎ.

ప్రధాన కార్యదర్శి :

శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి యం. యల్. ఎ.

సహాయ కార్యదర్శులు :

శ్రీ పిడతల రంగారెడ్డి యం. ఎల్. ఎ.

శ్రీ పెమ్మరాజు వెంకటారావు

కార్యవర్గము :

శ్రీ టి. చిరంజీవిరావు, మిన్నుల సూర్యనారాయణమూర్తి, మళ్ళపూడి పళ్ళంరాజు, అల్లూరి బాపినీడు, వేముల కూర్మయ్య, మండలి కృష్ణారావు, యన్. జి. రంగా, బెజవాడ గోపాలరెడ్డి, అనంత శయనం అయ్యంగారు, పెంచికల బసివిరెడ్డి, నీలం సంజీవరెడ్డి, టి. జి. తిమ్మయ్యశెట్టి, పెండేకంటి వెంకటసుబ్బయ్యగార్లు.

ప్రత్యేకాహ్వానితులు :

శ్రీమతి అమ్మన్నరాజా, కడప రామసుబ్బమ్మ, టంగుటూరి ప్రకాశంపంతులు, కళా వెంకట్రావు, కల్లూరి చంద్రమౌళి, గౌతు లచ్చన్న, డి. సంజీవయ్య, షేక్ గాలిబు, మరుపిళ్ళ చిట్టిగార్లు.



శ్రీ పిడతల రంగారెడ్డి



శ్రీ మల్లిపూడి పళ్ళంరాజు



శ్రీ వేముల కూర్మయ్య



శ్రీ పెందికల బసివిరెడ్డి



శ్రీమతి అమ్మన్న రాజా



శ్రీ కళా వెంకట్రావు



శ్రీ కల్లూరి చంద్రమౌళి



శ్రీ గౌతు లచ్చన్న



శ్రీ డి. సంజీవయ్య



శ్రీ మరుపిళ్ళ చిట్టి



శ్రీ మండలి కృష్ణారావు



దేశభక్త

కీ॥ శే॥ కొండా వెంకటప్పయ్య



దేశోద్ధారక

కీ॥ శే॥ కాశీనాథుని నాగేశ్వరరావు



ఆంధ్రరాష్ట్ర ప్రప్రథమ ముఖ్యమంత్రి

ఆంధ్ర కేసరి

శ్రీ టంగుటూరి ప్రకాశంపంతులు



మధ్యప్రదేశ్ గవర్నరు

Dr. శ్రీ భోగరాజు పట్టాభిసీతారామయ్య



మాజీ మద్రాసు శాసనసభాధ్యక్షులు

శ్రీ బులుసు సాంబమూర్తి



అఖిలభారత కిసాన్ కాంగ్రెసు అధ్యక్షులు

ఆచార్య శ్రీ గోగినేని రంగనాయకులు



ఆంధ్రరాష్ట్ర ముఖ్యమంత్రి

శ్రీ బెజవాడ గోపాలరెడ్డి

# నేటి జిల్లాకాంగ్రెసు అధ్యక్షులు



తూర్పుగోదావరి జిల్లా :
శ్రీ యస్. బి. పి. పట్టాభి రామారావు



పశ్చిమగోదావరి జిల్లా :
శ్రీ అల్లూరి బాపినీడు



తూర్పుకృష్ణా జిల్లా :
శ్రీ పన్నంటి పమిడేశ్వరరావు



పశ్చిమకృష్ణా జిల్లా :
శ్రీ కాకాని వెంకటరత్నం



నెల్లూరు జిల్లా :
శ్రీ M. హనుమంతరావు



కడపజిల్లా :
శ్రీ వి. రామిరెడ్డి

శ్రీకాకుళంజిల్లా :
శ్రీ కిల్లి అప్పలనాయుడు

విశాఖజిల్లా :
శ్రీ మిస్సుల సూర్యనారాయణమూర్తి

గుంటూరుజిల్లా :
శ్రీ వి. సత్యనారాయణ

చిత్తూరుజిల్లా :
శ్రీ ఎ. బలరామిరెడ్డి

కర్నూలుజిల్లా :
శ్రీ పి. వెంకటసుబ్బయ్య



అనంతపురంజిల్లా :
శ్రీ ఎ. చిదంబరరెడ్డి



బళ్లారిజిల్లా :
శ్రీ టి. జి. తిమ్మయ్యశెట్టి





కోశాధికారి

శ్రీ వెల్లాకుల జాలయ్య
M. L. A.



ఆహ్వాన సంఘాధ్యక్షులు

శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి యం.యస్.

---

కార్యదర్శి

శ్రీ మంతెన వెంకట్రాజు యం.యల్.ఎ.

# నాగార్జున సాగరం

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య, యం. ఎల్. ఏ.

ఆధునిక ఆంధ్ర జీవితంలో ఆంధ్రులు కన్న తియ్యని కలలలో నందికొండ-నాగార్జున సాగర ప్రాజెక్టు-నిర్మాణం చాలా ప్రధానమైంది. ఇందుకై ఆంధ్రులు మహోద్యమం నడిపారు. కృష్ణా ప్రవాహాన్ని ఆంధ్రేతర ప్రాంతాలకు పోకుండా రక్షించుకొని, ఆంధ్రులు వాహినులు, వేలు, లక్షలుగా కదలి ఎడతెగని తీవ్రాందోళన, సుహాసభలు, మహజరులు, రాయభారాలు, మూడు సంవత్సరాలు సాగించారు. ఆ ఆందోళన ఫలించింది యీనాడు. 10-12-1955 న భారత ప్రధాని పండిత జవహర్‌లాల్ నెహ్రూ ఈ ప్రాజెక్టు శంకుస్థాపన చేస్తున్నారు. ఇది చైతన్యమందిన ఆంధ్ర ప్రజానీకపు ప్రజాస్వామిక ఉద్యమాల ఐక్య ఆందోళనకు నిలయం.

ఈ ప్రాజెక్టు సాధించుటలో ఆంధ్ర ప్రజానీకం ఎంత పట్టుదల ఆందోళన, హాస్ఫూర్తి, నిర్లిప్తత, ప్రజా సమీకరణ, ప్రదర్శించారో, యీసారి ప్రాజెక్టు నిర్మాణంలోనూ, అంతకు మించిన ప్రజా సమీకరణ, పట్టుదల, ఐక్య సంఘటనా శక్తి నిర్వహించాలి. ప్రభుత్వం ప్రజాస్వామిక విధానాలతో ప్రాజెక్టు నిర్మాణాన్ని నడపాలి. ఆయకట్టు క్రిందికి రానున్న భూములు సర్వే సిద్ధం చేసుకొనుటలోను, పంటలు పండించుటలోనూ, పంట ఆదాయం అత్యధికంగా సాధించుటలోనూ, ప్రజల చైతన్యం - ప్రజాస్వామిక కార్యాచరణ సృజన శ్రేయం ప్రతిఫలించాలి.

ఇంత భారీయెత్తున సాగిపోతున్న యీ ప్రాజెక్టు నిర్మాణం దానంతటది సాగిపోగలదని, అటు ప్రభుత్వం యిటు ప్రజానీకం సోమరిగా నాటి పూర్వ ప్రాజెక్టుల నిర్మాణపద్ధతిలో ఆత్మ సంతృప్తిగా వుండడం కాకుండా, ప్రజలను కదిలించాలి. చైనా దేశంలో యీ మధ్య 40 లక్షల ఎకరాలు సాగుచేయగల ఉత్తర కియాంగ్సూ కాలవ ఆధునిక పరికరాలేమీ లేకుండానే ప్రజా సమీకరణతో ప్రజల ఉత్సాహంతో రోజుకు 3 కోట్ల ఘనపు టడుగుల మట్టిపని సాగించి 80 రోజులలో మొత్తం 248 కోట్ల ఘనపుటడుగుల మట్టిపని పూర్తిచేశారు. ఈ కాలవ పడక వెడల్పు 420 అడుగులు. దీని సామర్థ్యం 25,000/- క్యూసెక్కులు. ఇంత త్వరలో పని సాగించటానికి ప్రజల సమీకరణా, కార్యవిధానంలో ప్రజాస్వామిక విధానం అవలంబించారు. సాంస్కృతిక, ఆర్థిక, నైతిక, ప్రచార ప్రబోధాలే యీ జన సమీకరణను నిర్వహించినవి. తమదిగా భావించి ప్రజలు పనిచేయడం జరిగింది, అని మన భారత ప్రభుత్వం తరఫున యీ ప్రాజెక్టులను చూచివచ్చిన శ్రీ డాక్టరు కే. ఎల్. రావు, కన్వార్సేనులు చెప్తూ చున్నారు. ఈ పని పరిశుభ్రంగానూ, నైపుణ్యంగానూ వుందని, కాల్వలగుండా నీరు నిరంతరంగా ధారాళంగా ప్రవహిస్తున్నదనీ మెచ్చుకున్నారు.

ఈనాడు పునాది వేస్తున్న నాగార్జున సాగర డాము పొడవు 6220 అడుగులు. కుడి కాల్వ విడివి 286 మైళ్ళు. సామర్థ్యం 21,600 క్యూసెక్కులు, కాల్వ పడక 155 అడుగులు. లోతు 20 అడుగులు. ఇక ఎడమ కాల్వ 140 మైళ్ళు. పడక వెడల్పు 134 అడుగులు. లోతు 15 అడుగులు. సామర్థ్యం 12,000 క్యూసెక్కులు. కుడి కాల్వ క్రింద మొత్తంగా 26 లక్షలు, ఎడమ కాల్వ క్రింద 10 లక్షలు ఎకరాలు సాగు అవుతుంది. డాము ఎత్తు సముద్ర మట్టానికి 590 అడుగులు ఎత్తువరకు ఉంటుంది. ఒక డాముకే 18 కోట్ల ఘనపు టడుగుల రాయి, 75 లక్షల ఘనపు టడుగుల ఇసుక, 10 లక్షల టన్నుల సిమెంటు వాడవలసి వుంటుంది. రోజుకు 1100 యూనిట్ల పని జరగవలసి వుంటుంది. నెలకు 3 కోట్ల ఘనపు టడుగుల పని జరగవలసి వుంది. ఈ విధంగా సాగితే పది సంవత్సరాలలోగా పూర్తిఅవుతుంది. ఇది గాక రెండువైపుల 716 మైళ్ళ కాల్వలు, దానికి అనుబంధంగా దాదాపు వెయ్యిమైళ్ళ పంటకాల్వలు, చిన్న కాలవలు త్రవ్వవలసి వుంది. తలచుకుంటే ఒళ్ళు పులకరించడం లేదూ! ఈ సాగరం 110 చతురపు మైళ్ళ వైశాల్యం వుంటుంది. అసలు సాగర ప్రాజెక్టు నిర్మాణం అంతా 122 కోట్ల రూపాయలవుతుంది. డాము, సాగర్ కాలవలు తయారై సాగు జరుగుతున్నప్పుడు విమానంలో చూస్తే మరొక స్వర్గం అనిపించదూ!

ఇంత మహత్తరమైన కట్టడం ప్రజల చేతనే సాధ్యమవుతుంది అనేది మరువరాదు. ప్రభుత్వం ప్రజలు పరస్పరం పూర్ణవిశ్వాసంతో, అన్యోన్యతతో నిర్వహించినపుడే ఇది ప్రజల ప్రాజెక్టు కాకలుగుతుంది. ఈ డామును నాగార్జున సాగర్ కంట్రోలు బోర్డు నిర్వహించి నిర్మించుతుంది. ఇక కుడి కాల్వ ఆంధ్ర ప్రభుత్వం, ఎడమ కాల్వ హైదరాబాదు ప్రభుత్వం త్రవ్విస్తవి. ఇట్టి ఆయకట్టు నిర్ణయం, అందుకు సదుపాయాలు ఆయా ప్రభుత్వాలు నిర్వహిస్తున్నవి. ఇంతమంది పరిపాలనవల్లనున్న నష్టాన్ని గమనించే ముక్కోటి ఆంధ్ర ప్రజానీకం విశాలాంధ్ర కోసం ఎదురు చూస్తున్నది. విశాలాంధ్ర ఏర్పడడంతో ఇన్ని పాలనా నిర్వాహణలు లేకుండా ఒకే ప్రభుత్వం మొత్తం ప్రాజెక్టును నిర్వహించుతుంది.

పనులన్నీ కంట్రాక్టరులు, వారి తరఫున సబ్ కంట్రాక్టరులు, మేస్త్రీలు, కూలీలు దొంతరలుగా ఏర్పరచడం, చివరను అసలు పనిచేసిన కూలీకి కూలీ ముట్టక పోవడం నడుమనున్న దళారీలు మింగిపోవడం-విసిగి కూలీలు పరువెత్తిపారిపోవడం-పని స్థంభించడం - ఇతర కూలీలలో భయ సందేహాలు కలిపించడం, ఈ పద్ధతి పోవాలి. కార్మిక సహకారసంఘాలు నిర్మాణమై, వారికి సమిష్టిగా కూలీపని నిర్ణయం జరగడం, ఆ కూలీలకు కావలసిన తినుబండారాలు తదితర వస్తువులు సహకార స్టోర్సుల ద్వారా అందచేయడం. గృహవసతి సౌకర్యాలు ఏర్పరచడం ఎవరి కూలీ వారికి సమయంలో అందేటట్లు చూడడం జరగాలి.

ఈ కూలీలు, ఇతర పనివారు ఎల్లకాలం పని భారంతో విసిగి పోవడం కాకుండా డాము నిర్మాణస్థలం వద్దనేమి, కాల్వల త్రవ్వ ప్రాంతాల్లోనేమి, ప్రతిరోజు వేడుకలు వినోదాలు, నాటికలు, బుర్రకథలు, జానపదగేయాలు, గ్రామీణ నృత్యాలు

యేర్పరచి అందులో బయటివారు మాత్రమే కాక, యీ పనివారు కూడా పాల్గొనేటట్లు సాంస్కృతికోత్సవాలు యేర్పాటు చేయాలి. అధికంగా రేడియో సెట్లు యేర్పాటు చేయాలి, చలన చిత్రాలూ చూపాలి.

అంటువ్యాధులు రాకుండా తగు మలేరియా, కలరా, స్ఫోటకంలను అరికట్టే యేర్పాటులు వెనువెంటనే చేసి పశువుల చీడలుగాని, పక్షుల చీడలుగాని, నిరోధించ గలిగిన యేర్పాట్లు ఉండాలి.

కార్మికుల సమీకరణకు రాజకీయ పార్టీలు, ప్రజా సంఘాలు, ఇది ఒక ప్రజా స్వామిక ఉద్యమంగా, ఇది ఒక నూతనాంధ్ర నిర్మాణ రాజకీయ బాధ్యతగా, తలదాల్చి ఐక్యఉద్యమ నిర్వహణలో, యీపని నిర్వహణలో ఆందోళన మాత్రమే తమదిగా భావించక, సమీకరణ కూడచేసే పని ఉత్సాహంగా జరిగేటట్లు చూడాలి. దళాలు దళాలుగా కదలి యీ ప్రాజెక్టు నిర్మాణ స్థలంలోనేమి, కాల్వల త్రవ్వకం ప్రాంతాల్లోనేమి – వారి పరిసరాలలోనేమి ప్రజలలో కార్యోత్సాహం కలిగించాలి.

నిర్మాణ దళాలుగా అక్కడక్కడి యువకులు 1945 ప్రాంతంలో కృష్ణ కాలవ త్రవ్వినపుడు చూపిన కార్యోత్సాహం, సంఘటన, సాధించాలి. అంతేకాకుండా మట్టి త్రవ్వడానికి, రాయితోలడానికి, ఇసుక తోలడానికి అక్కడక్కడ గ్రామ ప్రాంతాలలో గ్రామంలోని బండ్లన్నీ ఒకరోజు కట్టి – బాడుగకే అయినా సరే – కుంకుమ బండ్లు నడిచిన పదతి తిరునాళ్ళకు పోతున్న పద్ధతి, ఆ ఉత్సాహం కలిగించాలి. గ్రామ గ్రామాల్లోని పురుషులు, స్త్రీలు, యువకులు, యువతులు అపుడపుడు పండగ తిరునాళ్ళవలె పాల్గొనే వీరోత్సాహాన్ని కలిగించాలి. బయటినుండి, పాఠశాలల, కళాశాలల, విద్యార్థులు విహార యాత్రలు ఇక్కడికి సాగించి, ఒకటి రెండు రోజులు ఏదో ఒక పనిలో పాల్గొనేటట్లు చేయాలి. ప్రజా జీవితంలో ప్రజా చైతన్యంతో ఆందోళన రూపంనుండి నిర్మాణ కార్యక్రమంలో భాగస్వాములుగా నడిచే మనో తత్వాన్ని యీ మహాదుద్యమంగా ప్రాజెక్టు నిర్మాణం సాగాలి.

ప్రాజెక్టు ప్రాంతాలలోనున్న బంజరు భూములు సాగుచేస్తున్న చోట, సాగు చేసుకుంటున్న బీదవారికి వారి మొత్తం భూమి 3 ఎకరాలకు మించని పద్ధతిలో యివ్వాలి. సాగుకు లాయకు అయిన భూమి యీ కార్యక్రమం కార్మిక వీరులగా పనిచేసిన వారికి మొత్తం భూమి 3 ఎకరాలు మించకుండా వుండే పద్ధతిలో వారికి పారితోషికంగా యివ్వాలి. ఈ ప్రాజెక్టు కాలవల క్రింద, రోడ్లక్రింద భవనాల క్రింద తదితర విధాలుగా యీ ప్రాజెక్టు నిర్మాణం క్రింద ప్రభుత్వ స్వాధీనం అయిన భూము లకు బదులుగా వారి వారి పరిసరాల నున్న భూమి యివ్వాలి. పరిహారం యివ్వవలసి వచ్చినపుడు జాగు జరుగకుండా, మధ్య మినహాయింపులు, దిగమింగుడులు లేకుండా ఆ భూఖామందులకు అందజేయాలి.

అసలు ప్రజలు – ప్రభుత్వం – నూతన ప్రజాస్వామ్య నిర్మాణంలో ఆచరణ సాధ్యం చేయాలి.

విజ్ఞాన ఖనియగు నాగార్జునుని పేర ఈ ప్రాజెక్టు నిర్మాణం చేస్తున్నాం. ఈస్థల ప్రధానాన్ని విస్మృతం కాకుండునట్లు చేయవలసి వుంది. ఈ సాగర్ వల్ల మునిగే విజయపురిని మరిచిపోనీయ కూడదు. ఈ డాము వద్ద ఒక నూతన నగరం వెలయనున్నది. ఆ నగరాన్ని విజయపురి అని నామకరణం చేయాలి. భూగర్భంలో వున్న విజయపురి దాని పరిసర శిలశిథిలాలు, స్థూపాలు యీ విజయపురి - యీ నూతన విజయపురిలో ఒక ప్రదర్శనశాల యేర్పరచి భద్రం చేసి యాత్రికులకు జీవం పోయాలి నాగార్జున దుర్గంపై చిన్న స్థూపం వుంచి స్మారకంగా వుంచాలి. విజయపురికి గుర్తుగా పూర్ణ కుంభంగల జయస్థంభం ఆ నాగార్జున దుర్గంపై యెత్తాలి. పడవలపై సాగే యాత్రాస్థలంగా చేయాలి.

ఈ జయస్థంభం - స్థూపం ప్రాచీన ఆంధ్ర వైభవానికి చిహ్నం అయితే, ఈ నాగార్జున సాగర్ ప్రాజెక్టు, ఆధునిక అభివృద్ధికి వినూత్న ఆంధ్ర జీవనానికి, వైభవానికి చిహ్నం కావాలి. చరిత్రలో ఆంధ్ర తెలంగాణా భేదాలు ఎరుగని ప్రాచీన ఆంధ్ర వైభవానికి యీ నాటి ఆంధ్ర జీవనం యీ సాగర్ నిర్మాణంలో అంతర్లీనం కావాలి. ప్రతిబింబించాలి నేటి ఆంధ్రుల వ్యవసాయిక, చారిత్రక, ఆర్థిక, వైజ్ఞానిక, సాంస్కృతిక, ప్రజాస్వామిక జీవితానికి చిహ్నంగా, ఆ నాడు శాంతశ్రీ నిర్మించిన విజయపురి మునుగవలసివచ్చినా, యీ నాటి ఆధునిక యుగంలో ప్రజాస్వామిక ఆంధ్ర ప్రజానీకం నిర్మించిన ఆంధ్రశ్రీ విజయపురి వద్ద విశ్వశాంతిశ్రీగా వెలయాలి.

జై ఆంధ్ర:

## ఆంధ్రలో

# పరిశ్రమలు - కార్మికులు

శ్రీ బి. జి. ఎమ్. ఎ. నరసింగరావు, ఎమ్. ఎల్. ఏ.



ఏ దేశ అభివృద్ధి అయినా ఆ దేశపు పారిశ్రామికాభివృద్ధి పైన మాత్రమే ఆధారపడి యుండును. పారిశ్రామికాభివృద్ధి ద్వారానే దేశంలో సుస్థిర ఆర్థిక వ్యవస్థ ఏర్పడగలదు. బలమైన కార్మికరంగానికి కూడ ఒక నిర్ణీతమైన పారిశ్రామిక విధానం అత్యవసరం. కాన దేశజనాభాను, దేశీయ అవసరాలను బట్టి మాత్రమే దేశీయ పారిశ్రామిక విధానం నిర్ణయింపవలసి యుంటుంది. స్వతంత్రం సిద్ధించిన తరువాత నేటి వరకూ ఈ విధానం క్రమబద్ధం చేయబడలేదు. బహుశా ద్వితీయ పంచవర్ష ప్రణాళికా నిర్వహణ కాలంలో నయినా భారీ పరిశ్రమల స్థాపనకు అధిక కృషి జరుగగలదు. తద్వారా దేశమందలి నిరుద్యోగ సమస్య పరిష్కరింపబడుతుందని తలుస్తాను.

నిరుద్యోగం కార్మికరంగానికి ప్రబలశత్రువు. నిరుద్యోగ సమస్య పరిష్కరింపబడనిదే ట్రేడుయూనియన్ రంగం పటిష్టం కాజాలదు. ఈ స్థితిలో ప్రకాశింపలేదు.

ఆంధ్రలో చెప్పదగ్గ పరిశ్రమలు ఏకొన్నో మినహాయిస్తే ఎక్కువ లేవనే చెప్పాలి. ప్రభుత్వమువారి లెక్కలనుబట్టి ఆంధ్రజనాభా 20,507,801. అయితే అందులో పారిశ్రామికపు కార్మికులు 1951 లో 111610, 1952 లో 106380, 1953 లో 95443 వీనినిబట్టి చూస్తే ఆయేటికాయేడు కార్మికుల ఉద్యోగాలు క్షీణిస్తున్నాయని తెలుస్తుంది. ఇక పరిశ్రమలదృష్ట్యా చూస్తే ఆంధ్రలోవన్నీ 'సీజనల్ పరిశ్రమలే' గాని 'రెగ్యులర్' పరిశ్రమలు చాలా కొద్ది.

ఇదేవిధంగా వ్యవసాయ రంగంలో పరిశీలించినా వ్యవసాయ కార్మికులు 40 లక్షలు, చిన్నతరగతి రైతులు 80 లక్షలమంది కనపడతారు. వీరందరికీ జీవనం గడపటం చాలా దుర్లభంగా కనపడుతుంది. పై లెక్కలనుబట్టి విచారిస్తే జనాభాలో సగం మంది సంవత్సరంలో ఎక్కువ కాలం నిరుద్యోగులన్నమాట. ఈ అశేషప్రజానీకానికి వృత్తులు కల్పించి జీవనాధారం కల్పించడం ప్రభుత్వపు ప్రథమకర్తవ్యం. కనీసం ద్వితీయ పంచవర్ష ప్రణాళికను అమలుపరచినా కొంతభాగం అభివృద్ధి సాధించామన్నమాటే.

ప్రస్తుతం వ్యవసాయ రంగంలో అభివృద్ధి కనబడుతున్నట్లుగా పారిశ్రామిక రంగంలో వాగ్దానించిన విధంగా అభివృద్ధికి ఏమీ జరుగుతున్నట్లు కనబడదు. ప్లానింగు మంత్రిగా శ్రీ కళా వెంకట్రావుగారున్నా, రాజమండ్రి పేపరుమిల్లు, గూడూరు పింగాణీ మిల్లుల అభివృద్ధిలోనే ఆంధ్ర ప్రభుత్వపు బాధ్యత తీరినట్లు తలుస్తున్నట్లుగా తెలుస్తున్నది.

ఏవేవో చిన్న చిన్న మైనరు పరిశ్రమలు స్థాపించినా, గాజులపరిశ్రమను పునరుద్ధరించినా, పంచదార, సిమెంటు ఫ్యాక్టరీలు నిర్మించినా షుమారు 4 వేలమంది కార్మికులకు మాత్రమే జీవనభృతి దొరకగలదు. ఇవి నిరుద్యోగ సమస్యా పరిష్కారానికి అంతగా ఎక్కువ దోహదం చెయ్యనేరవు. ఈ పరిశ్రమలు భారీఎత్తున అనేకంగా స్థాపించాలి. ప్రాజెక్టులద్వారా కార్మికులలో నిరుద్యోగం సమసిపోగలదని భావిస్తే అది అయినా ప్రాజెక్టులు తయారయ్యే వఱకే! దీనికి నిదర్శనం తుంగభద్ర ప్రాజెక్టు నిర్మాణం తదనంతరం అక్కడి కార్మికులను తొలగించటమే. ప్రస్తుతం కట్టనున్న నాగార్జున సాగరం నిర్మాణంలో పనిదొరికే కార్మికులకన్నా నిరుద్యోగులసంఖ్య ఎక్కువ. అందువలన ప్రాజెక్టుల మూలకంగా కార్మికులకు అదనపువసతులు దొరుకుతాయనటం అతిశయోక్తి. తాత్కాలిక ప్రయోజనాలు కల్పించే వసతులు శాశ్వత ప్రయోజన పథకంక్రింద పరిగణించుట మంచిది కాదు.

ప్రస్తుతం ఆంధ్రలో రసాయనిక ఎరువుల పరిశ్రమ, పండ్లనునిలవచేయు రసాయనిక పదార్థముల పరిశ్రమ, అట్టల తయారీ పరిశ్రమ మొదలగు అనేక పరిశ్రమలను స్థాపించుటకు అవకాశాలున్నాయి. కానీ ప్రభుత్వంవారు ఒక సిమెంటు, పంచదార ఫ్యాక్టరీలతోనే తృప్తిపడుతున్నట్లు కనుపడుతుంది. ఇతర దేశాలనుండి మనం అనేకం దిగుమతి చేసుకొంటున్నాం అవి అన్నీ మన దేశంలోనే స్థాపించుకోవచ్చు. దానివల్ల ఆర్థిక సౌష్టవం పెరిగి నిరుద్యోగం సమసిపోయి, కార్మికుల జీవితాలు సుఖవంతం కాగలవు. అనేక విలాస వస్తువుల దిగుమతులక్రింద పెట్టే ఖర్చు యీ దేశంలో పెట్టే అనేక పరిశ్రమలను స్థాపించుకోవచ్చు.

రాయలసీమలో నూనెగింజలు ప్రత్తి విశేషంగా పండుతవి. కాన అక్కడ నూనె, నూలు మిల్లులతో సహా, కాగితపు పరిశ్రమ, సబ్బులపరిశ్రమ, వనస్పతి తయారీ, తదితర అనేక నూనె మిల్లులను స్థాపించవచ్చు. ఆవిధంగా నిర్మించుటవలన అక్కడగల కార్మికులలో నిరుద్యోగం తొలగిపోతుంది. పైవిధంగా ఆంధ్ర ప్రభుత్వం తగిన చర్య తీసుకో గలదనుకుంటాను.

ఇక ఆంధ్రలోని కార్మికులను గాని వారి సమస్యలనుగాని యితర రాష్ట్రవాసులతో సరిపోలిస్తే మనవారి పరిస్థితి చాలా హీనంగా కనబడుతుంది. జీతాలలో నైతేనేమి, తదితర సౌకర్యాలలో నైతేనేమి మన కార్మికులు చాలా వెనుకపడి ఉన్నారు. పైవాటికి, కార్మికులకు నిర్ణీతజీతాలు లేకపోవడము, పరిశ్రమలనుబట్టి వారి

జీతాలు క్రమబద్ధం చేయకపోవటం, మొదలగునవిమాత్రమే ముఖ్య కారణాలవుతాయి. 'మినిమమ్ వేజస్ యాక్టు 1948' ప్రకారం మొన్నటివరకు కార్మికులకు కనీస వేతనాలు నిర్ణయించబడలేదు. వ్యవసాయ కార్మికులకు యింకా 14 గ్రామాలలో పైజీతాలు నిర్ణయించక పోవటం వాటికొఱకు మన ప్రభుత్వంవారు తగిన చర్యలు యింకా తీసుకోకపోవటం చాల విచారకరం. అదీగాక ఈ కనీస వేతనాలు అమలు జరిపే విధానం గమనిస్తే చాలా హాస్యాస్పదంగా ఉంటుంది.

ప్రభుత్వమువారి అధ్వర్యాన నడుస్తున్న పరిశ్రమల యందలి కార్మికుల స్థితి గతులు ప్రైవేటువారి యాజమాన్యమున నిర్వహింప బడుతున్న పరిశ్రమల యందలి వారికన్నా చాలా నికృష్టంగా ఉన్నాయి. ఎన్ని సంవత్సరాలు పనిచేసినా ఆ యుద్యోగం ఖాయం కాకపోవటం, ప్రావిడెంటు ఫండు యివ్వకపోవటం, గృహ, వసతి సౌకర్యాలు బొత్తిగా నాస్తి కావడం, కరువుభత్యం నిర్ణయించకపోవటం మన కార్మికుల స్థితిని చాలా నీచస్థాయికి తీసుకుపోతున్నది.

యాజమానుల, కార్మికుల మధ్య గల్గిన వివాదాలు ప్రభుత్వపు ట్రిబ్యునల్సు పరిష్కరించ లేనపుడు, 'ఆర్బిట్రేషన్'కు లేదా "ఇండస్ట్రియల్ ట్రిబ్యునల్"కు పంప వలసి ఉంటే, ప్రభుత్వపరిశ్రమలలో పనిచేయు కార్మికుల న్యాయమైన కోర్కెలతో గూడిన తగాదాలను ప్రభుత్వం, పైవారికి పంపదు. దీనికి 'ఎలక్ట్రిసిటీ' "హైవేస్" లలో పనిచేయు వేలకొలది కార్మికులే నిదర్శనం.

ముఖ్యంగా కార్మికులకు గృహవసతి చాలా అవసరం. రోజంతా కష్టించి పని చేసి యింటికివెళ్ళిన కార్మికుడు, కులాసాగా జీవనంగడపుతూ తిరిగితనలో జవసత్వాలు తెచ్చుకుంటానికి గృహవసతి అత్యంతావశ్యకం. ప్రస్తుతం నిర్మింపబడుతున్న ఏ కార్మిక కాలనీ చూచినా, కార్మికుల గృహవసతి సమస్యను తగిన విధంగా పరిష్కరించటం లేదని సులభంగా ఎవరైనా గ్రహించవచ్చు. ఒక చిన్న గదిలో ఆ కార్మికుని కుటుంబం యావత్తూ నివసించాలి. అటువంటి పరిస్థితుల మధ్య పెరిగేవారి బిడ్డలుకూడా ఏలా తయారవుతారో ఊహించగలం.

పండిట్ నెహ్రూ చెప్పినట్లు 'సింగిల్ టెనెమెంట్సు'ను పగలగొట్టి సరియైన పద్ధతిలో, ఆరోగ్యకరమైన సరళిలో కార్మికులకు గృహవసతి కల్పించటం ప్రభుత్వమువారి విధి.

పరిశ్రమలు అభివృద్ధిపొంది, సక్రమంగా నిర్వహింపబడి, దేశం ఆర్థికంగా, పారిశ్రామికంగా ముందంజవేయాలంటే అందలి కార్మికులను యజమానులు తగిన విధంగా సమాన గౌరవహోదాలతో ఆదరించాలి. పారిశ్రామికులు వారి పాత మనస్తత్వాలను వదలి, అన్నిరంగాలలోని కార్మికుల సంక్షేమాన్ని హృదయపూర్వకంగా ఆకాంక్షించాలి.

ముఖ్యంగా కాంగ్రెసు, ఆవడి మహాసభలో ఈ విధంగా తీర్మానించటం ముదావహం. ఆ విధంగా 'సమ సమాజవాద' పద్ధతి కాంగ్రెసు ఆధిపత్యముగల్గిన ఆంధ్ర ప్రభుత్వం, ఆచరణలో పెట్టి కార్మికుల జీవనస్థాయిని పెంచుటకు అవిరళకృషి సల్పగలదని ఆశిస్తున్నాను.

---

# 20 వ ఆంధ్ర ప్రదేశ్ కాంగ్రెసు రాజకీయ మహాసభ, గుంటూరు తేది 10-12-55

# అధ్యక్షోపన్యాసము

## శ్రీ నీలం సంజీవరెడ్డి

శ్రీ పండిట్ నెహ్రూగారు, సోదరీ సోదరులకు సుస్వాగతము :

నేటి రాజకీయ మహాసభ చాలా ముఖ్యమైనది. మనకు స్వరాజ్యం వచ్చిన తర్వాత మనం ఇలాంటి సభలను జరుపుకోవటం ఇదే మొదటిసారి. కొన్ని సంవత్సరాలక్రితం చెన్నపట్నంలో జరిగింది. ఆ తర్వాత నేడే మనం మళ్లీ ఈ విధంగా కలుసుకుంటున్నాం. అయితే, ఆనాటికన్న ఈనాడు మనం ఎంతముందుకు సాగిపోయామో, అను కొన్నదానికన్న, ఆశించినదానికన్న ఎంత చురుగ్గా సాగిపోయామో అందుకు ఈసమావేశమే నిదర్శనం. అప్పటికి ఇంకా మనకు స్వరాష్ట్ర వాంఛ స్వప్నంగానే ఉండిపోయింది. నాటి కల నేటి నిజమవటమేకాక, విశాలాంధ్రవైపు సాగిపోతున్నాం. ఈ సమావేశం ఆ పురోగమనానికే ప్రతిబింబం. మరొక ముఖ్యమైన సంగతి—పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ మన సమావేశానికి ప్రారంభోత్సవం చేయటం, దీనిని కేవలం లాంఛనప్రాయంగా కాని, యాదృచ్ఛికంగా కాని ఎంచకూడదు.

నాగార్జునసాగర ప్రాజెక్టుకు శంకుస్థాపన చేయటంద్వారా ఆంధ్ర జాతియొక్క భావి భాగ్యోదయానికి, యావత్తు ప్రజానీకపు సుఖతర జీవితానికి నెహ్రూ స్థిరమైన పునాది వేస్తున్నారు. నేటి మన రాజకీయ

మహాసభకు ప్రారంభోత్సవం చేయటంద్వారా, అట్టి ఉజ్జ్వల భవిష్యత్తును శాంతితో, సహకారంతో సృష్టింపజేసే నిర్దుష్టమైన ఆలోచనలను, దృక్పథాన్ని మనకు చూపెట్టుతున్నాడు. బ్రహ్మాండమైన పనులను చేయటంలో మనుష్యుడు ఇప్పుడేకాదు, యుగాలనుంచీ సిద్ధహస్తుడే. కాని ఆపనులను ప్రజలందరి సర్వతోముఖవికాసానికి ఉపయోగంగా తీర్చి దిద్దటంలోనే మనుష్యుడింకా సిద్ధహస్తుడు కాలేదు. అందుకనే ఎంతెంత పనిలోనూ ఏదో వెలితి మిగులుతూనే ఉంటోంది. ఈ అనాదిలోపాన్ని తొలగించి, మన కృషి ఎవరికీ వ్యతిరేకంగా కాకుండా, అందరికీ పనికివచ్చేట్టుగా రూపొందించటానికే శ్రీ నెహ్రూ జాతీయ రంగంలో అంతర్జాతీయ రంగంలో పాటుపడుతున్నాడు. ఈ నవభారత నిర్మాత, శాంతిదూత ఆశీస్సులతో ఈసభ జరగటం మన రాజకీయాల శుభపరిణామానికి ముఖ్యం.

మన రాష్ట్రం ఏర్పడిన సమయంలో దేశంలో చాలామందికి అనుమానాలు ఉండేవి. ఆంధ్రులు ఉద్రేకవంతులు. నిర్మాణాత్మకంగా కలసి పనిచేయగలరా అని అనుకొన్నారు. కాని స్వరాష్ట్రం సిద్ధించుకొనటంలో చూపిన ఉద్రేకానికి ఏమాత్రమూ తీసిపోని ఉపజ్ఞను, వివేకాన్ని, నిదానాన్ని పరస్పర సహకారాన్ని ఆంధ్రులు ప్రదర్శించుకొన్నారు. ఉద్రేకమనేది కేవలం వెర్రికాదని, చిత్తశుద్ధిలోంచి ఉద్భవించే చైతన్యమని, బాధ్యతాయుత చైతన్యమని నిరూపించారు. అంతేకాదు. తీవ్రాతి తీవ్ర భావాలతో అగ్నిపర్వతంలాగా ఉండే ఆంధ్ర రాష్ట్రంలో ఇంతవరకు ఎక్కడ ప్రజలు దౌర్జన్యంలోకి దూకటంగాని, పోలీసులు తుపాకులు పేల్చటంగాని జరగలేదు. ఈ పరిస్థితికి కారణం ఏమిటి ? రాష్ట్రం రాగానే మన అందరిలో అభిప్రాయభేదాలు పూర్తిగా తొలగిపోయినవా? ఐకమత్యం సంపూర్ణంగా సిదించిందా ? లేదు. వాద

విధాల్లో మనను మించినవారు లేరని చెప్పవచ్చు. పనిచేసేవాడొకడుంటే, వాడిని విమర్శించేవాళ్లు మనలో పదిమంది వున్నారు. అయినప్పటికీ, ఈ వివాదాలకు, విమర్శలకు అతీతమైన ప్రజానీకపు భవిష్యత్తు మన అందరకు క్రమక్రమంగా సహనాన్ని, శాంతాన్ని, బాధ్యతను అలవర్చింది. మనకన్న ఉద్రేకం ఎక్కువగావున్న ప్రాంతాల్లో దౌర్జన్యాలు, కాల్పులు జరిగినవి. అయితే మనం హోరాహోరీగా చర్చించుకున్నాం. ప్రదర్శనలు చేశాం—రైళ్లాపాం. అవిశ్వాస తీర్మానాలు ప్రతిపాదించాం. ఆమోదించాం. కాని తలకాయలు పగులగొట్టుకోలేదు. తుపాకిగుండ్లు రువ్వుకోలేదు. అక్కడక్కడ చిన్న చిన్న ఘర్షణలు జరిగినా, రాష్ట్రం మొత్తం మీద, కర్నూలులో మనం ప్రభుత్వాన్ని నెలకొల్పుకొన్నప్పటినుంచి, ఎంతో శాంతంగా ప్రవర్తించుకుంటున్నాం. ఇందుకు ప్రజల సహకారం, వివిధ పార్టీల వైఖరికూడా తోడ్పడింది. దౌర్జన్యం ఎటువైపునుంచి జరిగినా, అది యావత్తు ఆంధ్రజాతి శ్రేయస్సుకూ ప్రతిబంధకం అనేది అందరూ గ్రహించారు.

మన రాష్ట్రం, ఉద్రేకంతో చీటికి మాటికి ఉడుకెత్తే మన రాష్ట్రం ఇటీవల జరిగిన ఎన్నికలలో ఎంత వివేకంతో, ఎంత శాంతంతో, ఎంత చైతన్యంతో ప్రవర్తించింది? 'అమ్మో, ఇప్పు డెన్నికలే' అనుకొన్నవాళ్లున్నారు. రాష్ట్రమంతా దొమ్మీ దిబ్బ అయిపోతుందనుకున్నారు. కాని జరిగిందేమిటి? దేశంలోని విమర్శకులు ముక్కున వేలు వేసుకొనటమేకాక, ప్రజాస్వామ్యం తరతరాలనుంచి పాతుకుపోయిన విదేశాలవారుకూడా నివ్వెరపోయారు. మన ఉద్రేకం వారికి సరిగా అర్థంకాలేదు. ఉద్రేకం వారికి కేవలం వినాశనకరంగానే కన్పించింది. చిత్తశుద్ధికి, అన్యాయంపట్ల, అసమర్థతపట్ల అసహనానికి ఈ ఉద్రేకం చైతన్యచిహ్నం అని వారిప్పుడు గ్రహించారు. చలించకుండా [illegible]

విశేషం కాదు. ఉద్రేక మస్నంతమాత్రాన విచ్ఛిత్తికాదు; ఈ ఉద్రేకం ఆంధ్రజాతికి ప్రబలమైన చిహ్నం. దాన్ని సక్రమంగా ఉపయోగించటం ఎలాగో తెలుసుకొన్నవాడు ఆంధ్రజాతి భవిష్యత్తును గుప్పిట్లోకి లాగుకో గలుగుతాడు. ఈ సందర్భంలోనే పండిట్ నెహ్రూ సందేశం మనకు అమూల్యం.

మన శాంతియుత ప్రవర్తనగురించి, నేడు నెహ్రూ సందేశాని కున్న విశేషమైన విలువనుగురించి ఇంత విస్తారంగా ఎందుకు ప్రస్తావించా నంటె, ప్రజాస్వామ్య వికాసానికి శాంతి వాతావరణం ఎంత ముఖ్యమో నొక్కి చెప్పటానికే. అభిప్రాయభేదాలు, కార్యక్రమ విమర్శలు ఉండ వచ్చు. కాని వాతావరణం శాంతింగాలేనిదే, ఎవరు చేయగలిగినదీ ఏమీలేదు. ఈ శాంతంగాఉండే మన స్తత్వాన్నే ఇంకా స్థిరంచేసుకొని, ఇంకెక్కువగా మనం మున్ముందు ప్రదర్శించుకోనాలి. ఉద్రేకం వెనుక వున్న ఈ శాంతం, వివేకం, గ్రహించిన నెహ్రూకు మన కార్యక్రమాలపై నమ్మకం కల్గింది. రాష్ట్రం ఏర్పడినప్పటినుంచి కేంద్రంనుంచి మనకు అనేక విధాలుగా లభిస్తున్న సహాయసంపత్తులలో ఆ నమ్మకమే ప్రతిబింబిస్తోంది. ఇందుకు పండిట్ నెహ్రూకు, కేంద్ర ప్రభుత్వానికి మన ధన్యవాదాలు.

ఇంత ముఖ్యమైన మహాసభకు నన్ను అధ్యక్షుడుగా మీరందరూ ఇంచుమించు ఏకగ్రీవంగా ఎన్నుకొని, సన్మానహ్వానించారు. ఇది నాకెంతో సంతోషం. అంతేకాదు. ఎంతో విపరీతమైన బాధ్యతను నా కప్పగి స్తున్నారు. మహోన్నతమైన భవిష్యత్తు సిద్ధించనున్న తరుణంలో, ఆ సిద్ధికి దోహదపడవలసినరీతిగా మన మందరం మన మన ఆలోచనలను సరిదిద్దుకోవలసిన సమయంలో, ఇంత బాధ్యతను నాపైన వేస్తున్నారంటె, నాపై మీకున్న విశ్వాసానికి, అనురాగానికి అది నిదర్శనం. మీరు

లాది ప్రజలుచూపు ఆదరానికి నేను ఇంకెక్కువగా అర్హుడనవటానికి ప్రయత్నిస్తాను.

ఇంక మన రాష్ట్రపు సంగతులు చూద్దాం. ఎక్కడెక్కడవున్న ఆంధ్రులకూ రెండేళ్లక్రితం స్వరాష్ట్రం ఏర్పడటం ఉత్సాహం కలిగించింది. ఇప్పుడు మరొక ముఖ్యమైన ఘట్టం రానున్నది. అదే విశాలాంధ్ర. ఇది ముక్కోటి ఆంధ్రులకు శుభమైన ఘట్టం. ఆంధ్రుల చైతన్యం ఇంకా ఎక్కువ ఉధృతంగా, విస్తరంగా, నిర్మాణాత్మకంగా రూపొందే శుభ ముహూర్తమిది. అంటే ఇదివరలోకన్న ఇంకా ఎక్కువ బాధ్యతను, వివేకాన్ని అలవరచుకోవలసిన అదును ఇది. త్వరలోనే తెలంగాణ ఆంధ్ర ఏకమవుతవని ఆశిద్దాం.

ఇక బళ్లారి ప్రాంతం మళ్ళీ మనకు రాబోతోంది. ఇది అది మనకు చాలా అవసరం. ఈ ప్రాంతం మన రాష్ట్రంలో లేకపోవటం వలన, గడచిన రెండేళ్ళనుంచి తుంగభద్ర ప్రాజెక్టు - పని తృప్తికరంగా జరగలేదు. ఆ ప్రాజెక్టు రాయలసీమ అభివృద్ధికి చాలా అవసరం.

ఇక మైసూరులో కోలారు ప్రాంతంకూడా విశాలాంధ్రలో చేర వలసియున్నది. అక్కడ 100 కి 54 మందికి పైగా తెలుగువాళ్లున్నారు. ఒక కన్నడ తాలూకాను మినహాయిస్తే, 100 కి దాదాపు 60 మంది దాకా ఉంటారు. అలాగే ఒరిస్సా రాష్ట్రంలో పర్లాకిమిడి ప్రాంతంలో కూడా తెలుగువాళ్ళు 100 కి 70 మంది ఉన్నారు. పైగా ఆ ప్రాంతం ఒరిస్సాకానుకొని లేదు. మన రాష్ట్రంలోంచిగాని ఒరిస్సాకు, ఆ ప్రాంతానికి మార్గంలేదు. కాబట్టి ఆ ప్రాంతం ఒరిస్సాకు అనువుగాలేదు. అలాంటప్పుడు దానినికూడా విశాలాంధ్రలోచేర్చటం పరిపాలనదృష్ట్యా కూడా వీలు.

తెలుగువాళ్ళు సమూహంగా ఉన్న ప్రాంతాలు ఇంకా కొన్ని రాష్ట్రాల్లోనూ ఉన్నవి. కాని ఆ యా ప్రాంతాల విషయమై మనం ముమ్మందు ప్రభుత్వస్థాయిలో సంప్రదింపులు జరుపుకోవాలి. అవి కూడా ఎప్పటికైనా విశాలాంధ్రలో చేరటమే అందరకూ మంచిది.

మన కాంగ్రెసు అధిష్ఠానవర్గం విశాలాంధ్రకు సుముఖంగా ఉన్నదని మనకు తెలుసు. అందుకు కొంత కారణం గడచిన రెండేళ్ళలో మన రాష్ట్రం చేసిన కృషి. ఎన్నో విధాల ప్రతికూలమైన పరిస్థితుల్లో రాష్ట్రం ఏర్పడింది. అప్పటికి ఆహార పరిస్థితి ఇంకా అస్తవ్యస్తంగానే ఉంది. ప్రాజెక్టుల గురించి గాలిదుమారం బాగా రేగుతోంది. మొత్తం రాజకీయరంగంలోనే కాక, మన కాంగ్రెసు రంగంలోకూడా అప్పటికి పరిస్థితు లంత తృప్తికరంగా లేవు. అయినా మన అందరి నాయకుడు-ఆంధ్ర కేసరి శ్రీ ప్రకాశంగారి ఆధ్వర్యంలో మన మొదటి ప్రభుత్వం రాష్ట్రాభివృద్ధికై ఎంతో ఉత్సాహంతో, దీక్షతో పనిచేసింది. స్వాతంత్ర్య సాధనలోవలెనే స్వరాష్ట్ర పరిపాలనలో కూడ మన కండగా నిలచిన ఆంధ్ర కేసరికి జోహార్లు. అంత వేగంతో, సాహసంతో పనిచేయటం సామాన్యం కాదు. ఆ పనులన్నీ మీకు నేను వివరించ నక్కరలేదు. ఆ పనుల ప్రభావం ఎన్నికల్లో స్పష్టంగా కనిపించింది. ఆ పను లెంత ఉత్కృష్టమైనవో, విప్లవాత్మకమైనవో మీ అందరి ఉత్సాహ విశ్వాసాలే రుజువు చేస్తున్నాయి. వాటిని ఈసడించిన ప్రతిపక్షులకు, వారిని వారు ఎలా మభ్యపరచుకొన్నదీ, బాగా తెలిసింది. అయితే తెలిసేప్పటికే శ్రుతి మించింది. అదునుదాటిపోయింది. చేతులుకాలాక ఆకులకోసంచూచారు.

మన రాష్ట్రం ఏర్పడేప్పటికి, ప్రథమ పంచవర్ష ప్రణాళిక మధ్యలో ఉన్నాం. కాని ప్రణాళిక మద్రాసు రాష్ట్రంలో తయారైంది.

జాతీయ ప్రణాళిక కమిషన్ మన ప్రణాళిక మొత్తాన్ని రూ 58.66 కోట్లకు పెంచింది. ఈ మొత్తంకూడా తర్వాత రూ. 69.37 కోట్లకు పెంచబడింది. కేంద్ర ప్రభుత్వ కార్యక్రమాలను కలుపుకుంటె ప్రణాళిక మొత్తం రూ 75.90 కోట్లు ఉంటుంది. మన మొదటి ప్రణాళిక మన అవసరాలకు తగ్గట్టుగా తయారు కాలేదు. కాబట్టే ఇన్ని మార్పులు చేయవలసివచ్చింది. ఈ మొత్తంలో 100 కి 86 పాళ్ళు ప్రణాళిక ముగింపు నాటికి ఖర్చు అవుతుంది.

ఇహ రెండవ ప్రణాళిక సన్నాహంలో ఉన్నాం. దేశమంతటకూ ఇది రెండవ ప్రణాళిక అయినప్పటికీ, నిజానికి మనకిది మొదటి ప్రణాళికే. రాష్ట్రంలోని గ్రామాలన్నిటి అవసరాలను, వసతులను ఎంచుకొని, ఆదాయ వ్యయాలకు తగ్గట్టుగా అంచనావేసుకొని ప్రణాళికను తయారు చేయటమనేది ఇదే మొదటిసారి. కేవలం గ్రామాల అవసరాల లెక్కింపే కాదు, గ్రామస్థులే ఈ ప్రణాళికతత్వాన్ని గ్రహించి, దానిని రూపొందించ టంలో పాల్గొన్నారు. అందరనుకొన్నవన్నీ ప్రణాళికలో ఇమడకపోయి నప్పటికీ, ప్రజానీకం ఇలా పాల్గొనటం, ప్రణాళిక విజయంతోపాటు ప్రజా స్వామ్య వికాసానికికూడా తోడ్పడుతుంది. ప్రజలకు వాస్తవికదృష్టి ఏర్పడుతుంది.

రెండవ ప్రణాళిక సందర్భంలో ముఖ్యంగా చెప్పవలసిన విషయం:- కేంద్ర ప్రభుత్వం మనపట్ల ఎంతో సానుభూతిని చూపిస్తోంది. ఏదో ఒక్క పెద్ద ప్రాజెక్టుకు మాత్రమే రెండవ ప్రణాళికలో అవకాశం ఉండ గలదని అనుకున్నారు చాలామంది. అంతమాత్రం జరిగినా చాలులే అనుకున్నవాళ్లూ లేకపోలేదు. అయినా నాగార్జునసాగర ప్రాజెక్టుతో పాటు వంశధార, తుంగభద్ర ఎగువకాలవ ప్రాజెక్టులను ప్రణాళికలో చేర్చటానికి కేంద్ర ప్రభుత్వం అంగీకరించింది.

గడచిన రెండు సంవత్సరాల కృషిమూలంగానే మన ఆహార పరిస్థితి చక్కబడింది. ఈ ప్రాజెక్టుల మూలంగా ఆహార ధాన్యాలు మరింత సమృద్ధిగా పండగలవు. అయితే ఎక్కువగా పండించినంత మాత్రాన లాభంలేదు. ఆపంట సరిగా, సక్రమంగా అందరకూ, పేద ప్రజానీకానికి అందుబాటులో ఉండాలి. అధికోత్పత్తివల్ల ప్రయోజనం సూటిగా వారికి కలగాలి. మధ్యవర్తుల వ్యాపార చక్రాలక్రింద నలిగి పోకూడదు. కాబట్టి అధికోత్పత్తితోపాటు, సరి అయిన పంపిణీ విధానాన్ని ఏర్పరచాలి. పేద ప్రజానీకానికి అందుబాటులో ఉండేట్టు చూడాలి. అప్పుడే కృషికి సరైన ఫలితం సిద్ధిస్తుంది.

మొదటి ప్రణాళిక గడువులో ఆహారధాన్యాలు అదనంగా 4 లక్షల టన్నులకుపైగా పండినవి. 1950—51 లో 40.49 లక్షల టన్నులు పండితే 1955-56 లో అంచనాప్రకారం 44.60 లక్షల టన్నులు పండగలవు. ముఖ్యంగా వ్యవసాయపు దేశం కాబట్టి, వ్యవసాయం అభివృద్ధి చెందితేనే, మిగతా ఆర్థికరంగాల్లో అభివృద్ధి సిద్ధిస్తుంది. జాతీయాదాయంలో సగానికి సగం వ్యవసాయరంగంనుంచి వస్తోంది. ఈ విషయాన్ని మనం ఎప్పుడూ గుర్తుంచుకోవాలి. రెండవ ప్రణాళికలో అదనంగా 8 లక్షల టన్నుల ఆహారధాన్యాలను పండించాలి.

మనకు సరిపోగా, ఆహారధాన్యాలను ఇతర రాష్ట్రాలకు కూడా మనం పంపగలం. ఆవిధంగా ఆంధ్రరాష్ట్రం మొత్తం దేశానికి కూడ ఆహార విషయంలో తోడ్పడగలుగుతుంది.

అయితే ఆహారధాన్యాల అధికోత్పత్తి ఇతర పంటలకు ప్రతికూలంగా ఉండకూడదు. వేరుశెనగ, చెఱకు, పత్తిపంటలు పరిశ్రమల కవస
[illegible] 0.95 [illegible]

పండించాలి. అలాగే 20,000 శేళ్ళ ప త్తిని పండించాలి. ఇందు మూలంగా కొత్త పంచదార ఫ్యాక్టరీలకు, బట్టలమిల్లులకు తగిన ముడి పదార్థాలు లభించుతవి.

నీటి పారుదల వసతులను అభివృద్ధిచేస్తేగాని, వ్యవసాయం ముందుకుపోదు. మన రాష్ట్రంలో నదీజల సంపదలో మనం అయిదో వంతుకూడా సరిగా వినియోగించుకోలేకపోతున్నాం. ఉన్న నీటి వనరులను పెంపుచేసుకుంటె, అదనంగా ఒక కోటి ఎకరాలు సాగులోకి రాగలవు. అయినా, 4.84 లక్షల ఎకరాలనుమాత్రమే కొత్తగా సాగులోకి తేవటం రెండవ ప్రణాళిక లక్ష్యంగా పెట్టుకున్నాం. రెండవ ప్రణాళిక లోని ప్రాజెక్టులన్ని పూర్తిఅయితే, మొదటి పంటక్రింద 29.95 లక్షల ఎకరాలు, రెండవ పంటకింద 5 లక్షల ఎకరాలు సాగులో ఉంటంగా.

నీటి పారుదల ప్రాజెక్టులగురించి ముఖ్యంగా చెప్పవలసిన విషయాలు—తుంగభద్ర ప్రాజెక్టు పూర్తిగా ముగిసినట్టే. 1955-56 లో మన రాష్ట్రంలో 50,000 ల ఎకరాలు సాగవాలని అంచనా వేయబడింది. 1957-58 లో కృష్ణా బారేజిమూలంగా అదనంగా కృష్ణాజిల్లాలో 46,000 ఎకరాలకు, గుంటూరులో 71,000 ఎకరాలకు సాగు లభిస్తుంది. 1957 మార్చికి ఈ పని పూర్తికావచ్చు. రాళ్ళపాడు, అప్పర్ పెన్నారు ప్రాజెక్టులు ఈ సంవత్సరము పూర్తికాగలవు. 16 వేల ఎకరాలకు నీరు లభిస్తుంది. 1953-54 లో ప్రారంభించిన 18 మీడియం ప్రాజెక్టులు మార్చినెలకు పూర్తియగును.

ఇక నాగార్జునసాగర్ ప్రాజెక్టు గురించి :—ఈ ప్రాజెక్టుకు అవుతుంది చాలా ఖర్చు. ఆనకట్టమీద, కుడిపక్క కాలవమీద ఖర్చుకు రూ. 21 కోట్ల మొత్తం కేటాయించబడింది. ఈ ప్రాజెక్టు రెండు భాగా

లుగా జరుపబడుతుంది. మొదటి భాగంకింద రూ. 75.08 కోట్లు ఖర్చు అవుతుంది. ఇందులో మనవంతు ఖర్చు 49.39 కోట్లు. మిగతాది హైదరాబాదు ప్రభుత్వం భరిస్తుంది. ప్రాజెక్టుకు రెండు భాగాలకింద మొత్తం అయ్యే ఖర్చు రూ. 122.02 కోట్లు. మొత్తం 20.63 లక్షల ఎకరాలకు సాగు లభిస్తుంది.

తుంగభద్ర ఎగువకాలువ ప్రాజెక్టు మూలంగా, రాయలసీమకు క్షామపీడ తొలగుతుంది. దీనికి మొత్తం ఖర్చు రూ. 18.96 కోట్లు. బళ్ళారి ప్రాంతానికి ఆంధ్ర ప్రాంతానికి చేర్చి రూ. 7 కోట్ల ధనం రెండవ ప్రణాళికలో కేటాయించబడింది.

వంశధార ప్రాజెక్టుకు ప్రణాళిక చివరి రెండు సంవత్సరాల్లో ఖర్చుకుగాను కోటిరూపాయలు కేటాయించబడినవి. అయితే ఈ ఖర్చుతో వెంటనే సిద్ధించే ప్రయోజనాలు లేవు. ఈ ప్రాజెక్టుకు 1256 లక్షలు ఖర్చుపెట్టితే 2,24,000 ఎకరాలు సాగులోకి రాగలవు.

సిద్ధేశ్వరం, పులిచింతల ప్రాజెక్టులను మూడవ ప్రణాళికలో చేర్పించటానికి తగిన పరిశోధనలను చేయడానికిగాను రూ. 50 లక్షల మొత్తం వినియోగింపబడుతుంది.

కర్నూలు-కడప కాలవపని పూర్తి అయాక, మొత్తం మూడు న్నర లక్షల ఎకరాలు సాగవుతాయ్.

వరద నివారణ స్కీములను ప్రణాళికలో చేర్చలేదు. కేంద్ర ప్రభుత్వం వాటికి ప్రత్యేకంగా కేటాయింపులు చేస్తోంది.

భారీ ప్రాజెక్టులమూలంగా నీటి పారుదల వసతులేకాక, విద్యు చ్ఛక్తికూడా ఉత్పత్తి అవుతుంది. ఈ పారిశ్రామిక యుగంలో విద్యు

చ్ఛక్తి తర్వాతే ఏదైనా. కాని మొత్తం దేశంలోనే విద్యుచ్ఛక్తి వినియోగం మిగతా దేశాల్లోకన్న చాలా తక్కువ. వ్యక్తిసగటు వినియోగం దేశం మొత్తంమీద 14 యూనిట్లు. మన రాష్ట్రంలో 5 యూనిట్లే. కాబట్టి పారిశ్రామికాభివృద్ధికి మనం ఎంతగా పాటుపడాలో ఇందు మూలంగా తెలుస్తుంది. మొదటి ప్రణాళిక ముగింపుకు ఈ అయిదు యూనిట్లనుంచి వినియోగం పది యూనిట్లకు, రెండవ ప్రణాళిక ముగింపు నాటికి 20 యూనిట్లు పెరుగుతుంది. విద్యుచ్ఛక్తి ప్రాజెక్టులకుగాను రూ. 22.1 కోట్లు కేటాయింపబడినవి.

ముఖ్యంగా వ్యవసాయపు రాష్ట్రమైనప్పటికి మనకు పారిశ్రామికాభివృద్ధి అవసరం. అయితే ఇందుకు తగిన పెట్టుబడి మనకు లేదు. మన ప్రజానీకం అత్యధికంగా మధ్యతరగతి, ఇంకా తక్కువ స్థాయికి చెందినవారు. కాబట్టి కేంద్ర ప్రభుత్వంనుంచి, ఇతర రాష్ట్రాల పెట్టుబడిదార్లనుంచి మనకు సహాయం అవసరం. కేంద్ర ప్రభుత్వం ఎరువుల ఫ్యాక్టరీని మన రాష్ట్రంలో ఏర్పరచటానికి సమ్మతించింది. పెద్ద, చిన్న పరిశ్రమల విస్తరణకు తగిన మొత్తాలు కేటాయింపబడినవి.

చేనేత పరిశ్రమ చాలా ముఖ్యమైనది. దీని వ్యాప్తికి మన ప్రభుత్వం పూనుకున్నది.

ఇలాగే విద్య, వైద్యం మొదలైన రంగాల్లో అభివృద్ధికి ప్రణాళికలో తగిన మొత్తాలు కేటాయింపబడినవి. వెనుకబడిన వర్గాలకు, అడవి జాతులకు ప్రత్యేక స్కీములు ఏర్పాటు చేయబడుతున్నవి. వెనుకబడిన వర్గాలు ఎంత త్వరగా అభివృద్ధిచెందితే అంత మంచిది.

వ్యవసాయ పారిశ్రామిక రంగాల్లో అధికోత్పత్తికిగాను ప్రణాళిక క్రింద జరిగే కృషిని సూచించాను.

అయితే మొదట్లో చెప్పినట్టు, కేవలం అధికోత్పత్తి చాలదు. అది ప్రజానీకం యావత్తుకు సద్వినియోగం కావాలి. ఈ సందర్భములో ముఖ్యంగా భూమి సంస్కరణలను గురించి చెప్పాలి. కాంగ్రెసు తొలి సారిగా అధికారంలోకి వచ్చినప్పటినుంచి, దేశానికి వెన్నెముక అయిన రైతాంగానికి తగిన శ్రేయోదాయకమైన భూమి విధానాన్ని ఏర్పరచటానికి ప్రయత్నిస్తూనే వుంది. జమీందారీ విధానాన్ని రద్దుచేయడం జరిగింది. కాని అంతమాత్రానే చాలదు. భూమి సమస్య అనేకమైన చిక్కులతో కూడివున్నది.

భూమి సమస్య నిజానికి దేశం యావత్తుకూ సంబంధించినట్టిది. తరతమ భేదాలున్నప్పటికీ, కేవలం రాష్ట్రస్థాయిలోనే ఈ సమస్యను పరిష్కరించటానికి వీలులేదు. తరువాత మన రైతాంగంలో మోతుబరి ఆసాముల సంఖ్య అంత హెచ్చుగా లేదు. అయిదెకరాల లోపువారి సంఖ్యే హెచ్చు. తొందరపడి ఏదో ఒక సిద్ధాంతంబట్టో, లేకపోతే ఏ కొంతమంది ప్రయోజనంకోసమనో మార్పులుచేయటం మంచిదికాదు. ఈ సందర్భములో రెండు ముఖ్య లక్ష్యాలను దృష్టిలో పెట్టుకోవాలి. మొదటిది: ఏమి మార్పులు చేసినా, వ్యవసాయపు ఉత్పత్తి దెబ్బతిన కూడదు. రెండవది: వ్యవసాయదారులకు నిరుత్సాహం కల్గించే ప్రతిబంధకాలు ఉండరాదు. మన ప్రభుత్వం నియమించిన భూ సంస్కరణల సంఘం ఒక నివేదికను తయారుచేసింది. తగిన మార్పులు చేయటానికి ఇంకా కొంతకాలం పట్టక తప్పదు. అయితే ఈలోపు చూస్తూ వూరుకోసటానికి వీలులేదు. కౌలురైతులకు రక్షణను చేకూర్చాలి. కౌలు రైతు ఎంతో చెమటోడ్చి, అప్పూ సొప్పూ చేసి ఎద్దూ బండీ కొనుక్కొని నానావస్థలు పడ్డాక, రెండో సంవత్సరం రాగానే ఆసామీ అతనిని పొలంలోంచి వెళ్లగొట్టుతాడు. పడిన కష్టం వృథా అవటమే

కాక, చేసిన అప్పు మెడకు గుదిబండ అవుతుంది. ఈ దుస్థితిని సాధ్యమైనంత వెంటనే తొలగించటం అవసరం. కాబట్టి సమగ్రమైన భూమి సంస్కరణలను రూపొందించే లోపున, ముందుగా కౌలుదార్లకు తొలగింపు లేకుండా తగిన రక్షణను చేకూర్చాలి. అలాగే, సరసమైన కట్టుబడి ప్రమాణాలనుకూడా నిర్ణయించాలి. అలాగే, వ్యవసాయ కూలీలకు తగిన మజూరీ లభించేట్టు చూడాలి. ఇవి అత్యవసరాలు. ప్రభుత్వం ఈ సమస్యలను త్వరలో పరిష్కరించగలదని ఆశిద్దాం.

ఈ సందర్భములో వినోబాజీ భూదాన ఉద్యమంద్వారా చేస్తున్న కృషికి ధన్యవాదాలర్పించాలి. భూదానం భూమి సమస్య యావత్తునూ పరిష్కరించగలదా లేదా అనే సిద్ధాంత చర్చ మనకు వద్దు. భూదాన ఉద్యమంవల్ల భూమి సమస్యా పరిష్కారానికి తగిన వాతావరణంమటుకు ఏర్పడుతుంది. భూస్వామ్యవర్గంలో మార్పురావటం; ఆమార్పు పొలాలు లేనివారికి ఉపయోగించటం; వీటి వలన వాతావరణం ఘర్షణలతో కాకుండా శాంతియుతంగా, పరస్పర సహకారంతో ఉంటుంది. సంస్కరణలకు అట్టి వాతావరణం చాలా అవసరం. వినోబాజీ ఇప్పుడు మన రాష్ట్రంలోనే ఉన్నారు. వారి ఉద్యమం ఫలించి, తద్వారా మనకు తగిన వాతావరణం లభించగలదని నమ్ముదాం.

భూమి సమస్య గురించి జాతీయ ప్లానింగ్ కమిషన్ కూడా ఆలోచిస్తోంది. వ్యక్తికమతాలకు ఒక ప్రమాణమంటూ ఉండాలని సూచిస్తోంది. ఇట్టి ప్రమాణం అవసరం. అయితే ఈ సూత్రాన్ని కేవలం భూమి విషయానికే పాటిస్తే లాభంలేదు. నిజానికి ఇతర వసతులకన్న నేడు భూమివసతే హీనమైనది. వ్యాపారం, పరిశ్రమ, వేతనాలు ఈ రంగాల్లోని ఆర్జనా పరిమితులముందు వ్యవసాయపు ఆదాయ పరిమితి చాలా తక్కువ. కాబట్టి ఆదాయాలకు పరిమితి వుండాలనే సూత్రాన్ని

ఈ రంగాలకుకూడా వర్తింపజేయాలి. నిజానికప్పుడే జాతీయాదాయం ఇంతకన్న ఎక్కువ సరసంగా, సమంగా అధికసంఖ్యాకులకు పంపిణీ అవుతుంది. ఈ అవసరాన్ని మనం కేంద్రప్రభుత్వానికి చెప్పి, ఒప్పించాలి.

వివిధ వర్గాలను, వివిధ కార్యరంగాలను జాతీయ ఐక్యతకు పూనొన్పటం నేడు అత్యవసరం. ఏవర్గంగురించి, ఏరంగంగురించి ఆలోచించి నప్పటికీ, మొత్తం జాతీయ రంగంపై చూపు పెట్టుకోనాలి. ఏఒక రంగంలో చేసేకృషీ మరొక రంగానికి విఘాతం కాకూడదు. ఈ లక్ష్యాన్ని సిద్ధింపజేయటంలో సామాజిక ప్రాజెక్టులు బాగా ఉపకరిస్తవి. దేశ పునర్నిర్మాణానికి పండిట్ నెహ్రూ చూపించిన రాచబాట ఇది. ఈ ప్రాజెక్టులద్వారా దేశంలో నలుదిక్కులూ మేల్కొంటున్నవి. మన రాష్ట్రంకూడా నిర్విరామంగా కృషిచేస్తోంది. వ్యవసాయం, కుటీర పరిశ్రమలు, చిన్నపరిశ్రమలు, విద్య, వైద్యం......ఇత్యాది గ్రామీణ కార్యక్రమాలన్నీ, వేటికవేకాకుండా, ఒకే వ్యవస్థద్వారా అమలు జరుపబడుతున్నవి. ఈ కార్యక్రమాల ద్వారా ప్రభుత్వం వేలాది గ్రామాల్లో, కుగ్రామాల్లో కూడా ప్రజానీకానికి ముఖాముఖీగా తోడ్పడుతోంది. ప్రభుత్వమంటె శిస్తువసూలుదారు మాత్రమేకాదని, సహాయసంపత్తుల నందిచ్చే ప్రజాస్వామ్యమని ప్రజలు గ్రహిస్తున్నారు. ఈ ప్రాజెక్టులు మా ప్రాంతంలో ఆరంభించండి అని మనలో చాలా మంది కోరటమే ఈ ప్రాజెక్టుల విజయానికి నిదర్శనం. ఈ విధంగా పండిత నెహ్రూ స్వప్నం నవభారతంగా నిజమవుతోంది.

దేశం, దేశంతోపాటు మన రాష్ట్రం ప్రజాస్వామ్యాన్ని ఒక్క రాజకీయరంగంలోనే కాకుండా, ఆర్థికరంగంలో, సాంస్కృతిక రంగంలో జయప్రదం చేయవలసియున్నది. స్థాణువులుగా ప్రజలు పతనమై ఉన్న ప్పుడు, నినాదాలద్వారా ఉద్రేకపరచి, మేల్కొల్పవలసి వస్తుంది. మన కోటానుకోట్ల ప్రజలు దాస్యమనే జడత్వంలోంచి మేల్కొన్నారు.

కాబట్టి ఇక నినాదాలు, కేవల ఉద్రేకాలు అవసరంలేదు. ప్రజలు చైతన్యవంతులయారు. పరాయి ప్రభుత్వాన్ని వెళ్లగొట్టారు. ఇక ప్రతి ఘటనలను, ఆందోళనలను వాటి కవే పరమావధిగా సాగించటానికి అవసరంలేదు. ఇప్పుడున్న మహాకార్యం, శతాబ్దాలతరబడి నిర్వీర్యమై వినాశనమై యున్న దేశాన్ని, అంటె ప్రజల జీవితాన్ని మళ్ళీ తీర్చి దిద్దుకొనటం. మన ఉద్ధరణను, క్షేమాన్ని, రక్షణను, వికాసాన్ని అవరోధించే ప్రతికూలశక్తులు ఈనాడు బైట లేవు. మనలో యున్నవి. మనమే ఒకరికొకరం ప్రతిబంధకంగా ఉంటాం. ఈ సంగతిని మనం గాఢంగా గుర్తించాలి. మనమందరం ఉన్నది ఒకరినొకరిని అణచుకొనటంకోసం కాదు. అందరం వికాసవంతంగా ఉండాలి. ఏ ఆలోచనలు, ఏ దృక్పథం, అట్టి సామరస్యాన్ని, అట్టి సార్వజనీన శ్రేయస్సును చేకూర్చగలవో, అట్టి ఆలోచనలను, దృక్పథాన్ని మనం అలవరచుకోనాలి. ఈ సందర్భంలోనే మనను కని పెంచి పెద్దచేసిన కాంగ్రెసుపార్టీ విశిష్టతను నొక్కి చెప్పాలి. సర్వస్వాన్ని నాశనంచేసిన సామ్రాజ్యశక్తుల నెదుర్కొనటంలోనే కాంగ్రెసు అద్వితీయమైన, ఉత్తమమైన సంస్కృతిని, సంప్రదాయాలను ప్రదర్శించింది. నెలకొల్పింది. సఫలమైంది. అసత్యానికి ఒడిగట్టకపోవటం, మానవ పరిణామంలో హీనస్థాయికి, ఆటవికస్థాయికి చెందిన దౌర్జన్యానికి, హింసకు తలొగ్గకపోవటం, శత్రువులను సైతం సహృదయంతో ఆహ్వానించటం......ఈ రీతులద్వారా సాధ్యమైనంత తక్కువ ఘర్షణతో స్వాతంత్ర్యాన్ని సిద్ధింపజేసింది. ఎన్నో పార్టీలు మితవాద, అతివాద పక్షాలుకూడా పాటుపడినయ్. కాని ఈ ఉత్తమ సంస్కృతిలోని మానవ పరమార్థాన్ని గ్రహించలేకపోవటంతో, అవి వృద్ధిచెందలేకపోయినయ్. మహావృక్షంలా కాంగ్రెసు పెరిగిపోతే, అవి ఇంకా చిన్నచిన్న మొక్కలుగానే ఉండిపోయినయ్. ఉండిపోతున్నయ్. ఇతర పార్టీలను ఈసడించటానికి కాదు ఇలా చెప్పటం. ఏపని చేసినా

ఉత్తమ సంస్కృతి ననుసరించినప్పుడే, ఆ పనికి ఫలితంకూడా కేవలం విజయంగానేకాక, మానవజాతి శ్రేయస్సుకే తోడ్పడుతుంది అని నిరూపించడానికే. పార్టీల బాహ్య నిర్మాణశక్తి అవసరం. ఆ శక్తి కార్యరంగానికి అత్యవసరం. కాని ఆ శక్తికి సార్థకత్వాన్ని ఆశీర్వదించే శక్తి మరొకటి వుంది. అది పార్టీల ఆంతరంగిక దృక్పథం. ఈ ఆంతరంగిక బాహ్యశక్తులు సమన్వయమైనప్పుడే, ఆ పార్టీద్వారా ప్రజల సామూహికకృషి సామాజిక శ్రేయస్సుగా, కల్యాణంగా పరిణమిస్తుంది. ఇట్టి సమన్వయానికి, ఎన్ని లోపాలున్నప్పటికీ, ఇంకా కాంగ్రెసుపార్టీయే ప్రతిబింబం. మిగతా పార్టీల తొట్రుపాటులకు, తూలుడుకు, తాత్కాలికపు ఉద్ధతి పతనాలకు ముఖ్యమైన కారణం-ఈ సమన్వయం లేకపోవటమే. అంతేకాదు, ఉత్తమ సంస్కృతి కనుగుణమైన ఆంతరంగిక దృక్పథమే వాటికి లోపించినట్లుంటుంది. వాటిలోనూ మేధావులూ, త్యాగులూ ఉదారులూ ఉన్నారు. అయినవారివి ఎప్పుడూ మామూలుగా తప్పటడుగులే. నిజానికి కేవలం పార్టీ నిర్మాణపు బలాబలాల దృష్ట్యా చూస్తే, కాంగ్రెసుకన్న ఖచ్చితమైన నిర్మాణశక్తి ఇతర పార్టీలకున్నట్లే కనబడుతుంది. యువకుల్లో, పేదల్లో, శ్రామికుల్లో ఎక్కువమంది తమ పార్టీల్లో ఉన్నట్లే వారు చెప్తూతారు. అయినా ప్రజానీకం యావత్తు కళ్లు తెఱచి, ఏమార్గంవెంట వెళ్లాలా అని ఎంచుకోవలసినప్పుడు, మన పార్టీల బాహ్య చాతుర్యం, ప్రచారం, శక్తి కావు, వారికి గురి. మనపార్టీల అంతిస్తుకేసే చూస్తారు. ఎంత నికృష్టుడైనప్పటికీ నికృష్ట సంస్కృతినికోరడు. ఉత్తమ మానవ సంస్కృతివైపే అర్రులు చాస్తాడు. కాంగ్రెసువల్ల తమ ఆశలన్నీ పూర్తిగా ఫలించకపోయినప్పటికీ, ఇతరులు అరచేతిలో వైకుంఠాన్ని చూపిస్తున్నప్పటికీ ప్రజానీకంలో అధిక సంఖ్యాకులు కాంగ్రెసునే ఎందుకు అభిమానిస్తున్నారు? ఉత్తమ సంస్కృతికై కాంగ్రెసు పాటుపడుతోంది కాబట్టే.

అయితే మన పార్టీలోకూడా మనం ఈ ఉత్తమ సంస్కృతి పథాన వెనుకబడినప్పుడల్లా, మనపార్టీ దెబ్బతిన్నది. ప్రజలు అసంతృప్తి చెందారు. మనలోమన కావేశాలు, అపోహాలు, స్వార్థాలు విజృంభించి నప్పుడల్లా, మనలక్ష్యం, ఉత్తమ సంస్కృతి దెబ్బతిన్నది. మనమూ దెబ్బతిన్నాం. ఈ నీడలో ప్రతిపక్షులు బలపడాలనుకున్నారు. కాని అసంతృప్తిచెందినప్పటికీ, ప్రజలకు ఇంకా కాంగ్రెసుపైనే చూపుఉంది. చూపు వుంటుంది. మన లోపాలను మనం తొలగించుకున్నాం. తొల గించుకుంటున్నాం. విభేదాలు పోతున్నవి. ఐకమత్యం సిద్ధిస్తోంది. ప్రజలకు మళ్లీ విశ్వాస గౌరవాలు హెచ్చినవి. ఎన్నికలలో ప్రతిపక్షు లను ఎవరూ ఊహించలేనంతగా ప్రజలు పక్కకు తోసేశారు. కాంగ్రె సుకు ఎవరూ ఆశించనంతగా పట్టాభిషేకం చేశారు. ఈ ఎన్నికలు ప్రతి కక్షులకేకాక మనకూ మంచి గుణపాఠం. నాయకులమని చెప్పుకొని, ఊహాస్వర్గాలను చూపేవారికి ఉత్తమ సంస్కృతిపట్ల లక్ష్యం లేక పోవచ్చు. నమ్మకం లేకపోవచ్చు. వారికి సాధనంకన్న సిద్ధి ఎక్కువ కావచ్చు. వారికి వివేకం, విచక్షణ అవసరం లేకపోవచ్చు. కాని ప్రజా నీకానికి, పేదప్రజలకు, పీడితులకు ఉత్తమ సంస్కృతిపట్ల లక్ష్యం పూర్తిగా ఉన్నది. ఎంత దుర్భరదారిద్ర్యంలో, పీడనలోకూడా వారు అకార్యాలను చేయటానికి ముందుకురారు. కావలసిన పనిని ఏదో విధంగా చేసేయటమే అనే సిద్ధాంతాన్ని వారెప్పుడూ ఒప్పుకోనరు. ఈనాటి కుచేలుడు రేపటి కుబేరుడవటమేకాదు వారి లక్ష్యం. వారికి కొన్ని విలువల్లో విపరీతమైన విశ్వాసంవుంది. ఆ విశ్వాసమే యుగ యుగాలక్రితం మన దేశానికి వన్నె తెచ్చింది. నేడూ తెస్తోంది. ఆ విలు వలకు నష్టం వాటిల్లకుండా సుఖతరమైన, వికాసవంతమైన జీవితాన్ని సిద్ధింపజేసుకోనటమే వారి తత్వం. అట్టిదృక్పథమున్న పార్టీనే వారు గౌర విస్తారు. ఈ తత్వాన్నే ఎన్నికలు మనందరికూ బోధించినవి. గారడీలో వలెతక్షణమే అన్నీ జరగాలని వారు కోరడంలేదు. వారు కోరేవి:

చిత్తశుద్ధి, ఉత్తమ విధానాలు, అందరి శ్రేయస్సు. రాజకీయ నాయకులు, విప్లవవీరులు తమతమనీడల్లో ఎడంగా జీవిస్తారు. కాని ప్రజల జీవితం ఒకరినొకరిని ఆశ్రయించు కున్నది. తెల్లవారితే వారు ఒకరితో ఒకరు కలసి మాట్లాడుకోవాలి. పనిచేసుకోవాలి. ద్వేషం, స్పర్థ, పీడన వర్గరాలుంటె, వారికి ఉన్న దైన్యాలుండగా, కొత్త దైన్యాలుకూడా తలకెక్కి, క్షణం సుఖంలేకుండా పోతుంది. కాబట్టి ఎన్నికలద్వారా ఉత్తమ సంస్కృతిపట్ల ప్రజానీకం ఖచ్చితంగా, నిస్సందేహంగా ప్రదర్శించిన గౌరవాన్ని మనం సరిగా అర్థంచేసుకొని, ఆవిధంగా మన పార్టీ నిర్మాణంలోవున్న లోపాలను సరిదిద్దుకొందాం. ఇదివఱకటికన్న ఇప్పుడు ఇంకెక్కువ బలం, సంఘటన మనకు చేకూరినవి. మనపార్టీ బాహ్య నిర్మాణ శక్తిని చక్కబఱచుకొని, పటిష్టంచేసుకొంటేనే, ప్రజానీకపు ఆశలను నెరవేర్చిన వారమవుతాం.

నేడు మనం కేవలం ఉపన్యాసాలతో, నినాదాలతో తృప్తిపడి లాభం లేదు. శిథిలమైయున్న భవంతిని మళ్లీ నిర్మించాలి. మనకు ఎట్టి ఎట్టివసతులు ఎక్కడెక్కడవున్నవో వాటిని ఏవిధంగా వినియోగించాలో తెల్సుకోవాలి. మనపార్టీలోని కార్యకర్తలు, యువకులు రాజకీయ నినాదాలకన్న ఇక ఆర్థిక విషయాలపట్ల ఇంకెక్కువశ్రద్ధను చూపటం అవసరం. గాలిలో మాట్లాడి లాభం లేదు. వట్టిసిద్ధాంతాల కోసం గొంతుకచించుకొని లాభంలేదు. ఉన్నవసతులు, అవసరాలు వీటికి ఉత్తమ సంస్కృతిరీత్యా ఏవిధంగా సమన్వయంకలిగించాలో దానిని గురించి పరిశోధనలు సాగించాలి. చర్చలు జరపాలి. తదనుగుణమైన కార్యక్రమాలను సూచించాలి. స్వయంగా కూడా నిర్మాణ కార్యక్రమాలను అమలు జరపాలి.

పూర్వంలో మన మిత్రులు కొంతమంది పార్టీని విడిచి, మళ్ళీ ఇప్పుడు మనలోకి వచ్చారు. ఇందుకు వారిని మనం ప్రత్యేకంగా అభినందించాలి. ఇంకా పార్టీ బైటనున్నవారినికూడా తిరిగి కాంగ్రెసులో చేరిపోవలసినదిగా ఆహ్వానిస్తున్నాను. మన అందరకు లక్ష్యం ప్రజానీకపు

శ్రేయస్సు. కాబట్టి ఎట్టి సంకోచాలు, అపోహలు లేకుండా, వారు తమ యావత్తు శక్తినీ పార్టీ యనుగడకు అంకితం చేయగలరని నమ్ముతున్నాను.

కాంగ్రెసు ఉత్తమ సంస్కృతీ సంప్రదాయాలు స్వాతంత్ర్య ఉద్యమపు రోజులలో వలెనే నేడూ అనేక విదేశాల గౌరవాన్ని చూరగొంటున్నవి. ఇందుకు పండిట్ నెహ్రూ కృషే కారణం.. కేవలం మన సాంప్రదాయాలకు విరుద్ధమైనవారుకూడా మన దృక్పథాన్ని చూచి ఎలా మెచ్చుకుంటున్నారో నేడు మనం చూస్తూనే వున్నాం. ఇందాక చెప్పినట్టు, బాహ్యశక్తి, సైనికశక్తి విపరీతంగావున్న దేశాలకు లేని గౌరవం మనదేశానికి ఈనాడు వున్నదంటె అతిశయోక్తిలేదు. అందుకు కారణం దేశాన్ని ఉత్తమ సంస్కృతీమార్గాననడిపిస్తున్న పండిట్ నెహ్రూ. ఉత్తమ సంస్కృతి ప్రకారం ఆర్థికసామాజిక నిర్మాణాన్ని కొనసాగించటానికి గాను, పండిట్ నెహ్రూ 'సోషలిస్టు రీతి'ని కాంగ్రెసుకు లక్ష్యంగా నిర్వచించాడు. యుగధర్మాన్ని మానవపరమార్థానికి అనుగుణంగా సమన్వయంచేసి, సామాజిక నిర్మాణానికి శాంతియుతమార్గాన్ని పండిట్ నెహ్రూ చూపుతున్నాడు. మనం అందరం ఆయనపై దేశీక రాజనీతికి పూర్తిమద్దతునిస్తున్నాం. అంతటితో చాలదు. మన మన కార్యక్రమాలద్వారా ఆయన కలలను నిజాలుగా మార్చినప్పుడే, 'సోషలిస్టు రీతి'ని మానవ ఉత్తమ సంస్కృతి కనుగుణంగా ఆచరించినప్పుడే, అంతర్జాతీయ రంగంలో పండిట్ నెహ్రూకు ఇంకెక్కువ స్థానాన్ని, బలాన్ని చేకూర్చిన వారం అవుతాం.

ప్రజాస్వామ్యానికి విజయదుందుభిని ఘంటాపథంగా మోగించిన ప్రజలందరకూ ధన్యవాదాలు. ఉద్రేకపు పటువళ్ళతో తృప్తిచెందక. ప్రజల ఉద్ధరణకు నిర్మాణాత్మకంగా కృషిచేస్తున్న మన విద్యార్థులను ప్రత్యేకంగా అభినందించాలి. వారిలో ఎంతో అనంతమైన శక్తి దాగి వుంది. దానిని నిర్మాణానికి పూన్చాలి. ఆంధ్ర యువకుల త్యాగనిరతి అద్వితీయం. ఎక్కడ అన్యాయం కనిపించినప్పటికీ, అక్కడకుదూకుతారు. ఇటీవలనే గోవా సత్యాగ్రహంలో పాల్గొని పూర్ణాహుతిఅయి, మన

తెలుగు బిడ్డలు దేశమంతటిని దిగ్భ్రమ పరిచారు. ఆంధ్రుడిది సంకుచిత మనస్సు కాదు. ఈసత్యమే గోవా సత్యాగ్రహంలో మరొకసారి స్పష్టమైనది. ఈయువక వీరులకు మన జోహార్లు! ఇట్టి పునీతమైన త్యాగం వృధా కాదు. త్వరలోనే గోవాలోకూడా మన జాతీయ పతాకం ఎగురుతుంది. అందుకు ధ్వజ స్తంభమే ఈ అమరవీరులు.

నేడు మనకు చాలా పర్వదినం. పండిట్ నెహ్రూ సముఖంలో ఆయన మాటల్లో చిత్రితమై యున్న దేశాన్ని, అంటె ప్రజానీకపు జీవితాన్ని సిద్ధింపజేయటానికిపూనుకుందాం. గాంధీజీని అనుసరించి స్వాతంత్ర్య స్థాపనకు తోడ్పడ్డాం. అలాగే పండిట్ నెహ్రూను అనుసరించి సర్వజనులూ సుఖంగా వుండే సోషలిస్టు సామాజిక స్థాపనకూ విజయవంతంగా కృషి చేద్దాం. అంతర్జాతీయ రంగంలో ఆయనకోరే ఉత్తమ సంస్కృతిని జాతీయ రంగంలో స్థిరపరచే ఉత్కృష్టబాధ్యత మనది. భారత దేశం మహోన్నత దేశం అని ప్రపంచం యావత్తూ పరోక్షంగా ప్రశంసించింది. ఇప్పుడు మనం ప్రత్యక్షంగా దానిని నిరూపించాలి. ఉత్తమ సంస్కృతికి భారత దేశం పుణ్యక్షేత్రమవాలి. వ్యవసాయ రంగంలో, పరిశ్రమల రంగంలో, వ్యాపార రంగంలో, పరిపాలనా రంగంలో, విద్యా వైద్య రంగాల్లో, మన దైనందిన జీవితంలో మనం ఉత్తమంగా జీవించటానికి ప్రతిజ్ఞ చేద్దాం. మనుష్యుడిని పీడించకుండా, చంపకుండా మనుష్యునికి జీవనాన్ని, జీవితాన్ని ఉత్తమంగా ఏర్పరచవచ్చును అని మాటలద్వారానే కాదు, చేతలద్వారా నిరూపించాలి. తోటి పార్టీలవారికి, సంస్థలవారికి కూడా నా విజ్ఞప్తి ఇదే.

ఆంధ్ర ప్రజల ఉజ్వల భవిష్యత్తుకు నేడు నవోదయం. ఇట్టి శుభ ముహూర్తానికి నన్ను మీ రందరూ ఆహ్వానించినందుకు, మీ అందరకూ మిమ్మల్ని పంపిన ప్రజ లందరకు, పిన్నలకు, పెద్దలకు, కాంగ్రెసుపై నమ్మకం ఏమాత్రం సడలకుండా ఉన్న పేద ప్రజలకు, హరిజనులకు యావన్మందికీ నా ధన్యవాదాలు.

జై హింద్ !

# 20 వ ఆంధ్ర ప్రదేశ్ కాంగ్రెసు రాజకీయ మహాసభ,

## గుంటూరు, తేది 10-12-55

# ఆహ్వాన సంఘాధ్యక్షోపన్యాసము

## శ్రీ కాసు బ్రహ్మానంద రెడ్డి

పూజ్య పండిట్జీ, అధ్యక్షా, సోదరీ సోదరులారా !

మనము ఆంధ్రప్రదేశ వార్షిక సమావేశములో పాల్గొని దాదాపు పదు సంవత్సరములైనది. ఈ నాడు మీకు స్వాగతమిచ్చు భాగ్యము నాకు కలిగినందులకు మిక్కిలి సంతోషించుచున్నాను. యీ పదు వత్సరాలలో భారత దేశములో చరిత్రాత్మకమైన ఎన్నో సంఘటనలు ఘటిల్లినవి. భారత దేశము ప్రజాస్వామ్య రూపం దాల్చినది. ఆంధ్రుల చిరవాంఛిత ఆంధ్ర రాష్ట్ర మవతరించినది. ఇతర విషయములు ప్రస్తావించుటకు ముందు, భారత స్వాతంత్ర్య పోరాటములో పాల్గొనిన అసంఖ్యాకులైన అజ్ఞాత వీరులను స్మరించుట నా విధ్యుక్త ధర్మము. శ్రీ దేశభక్త కొండా వెంకటప్పయ్యపంతులు దివంగతులైరి. శ్రీ పొట్టి శ్రీరాములు అమరజీవులైరి. కాంగ్రెస్ సంస్థకు అపార సేవచేసిన మహనీయులు పలువురు మనలను వీడినారు. వారొనర్చిన త్యాగము, సేవలకు మనము జోహారు లర్పించవలసి యున్నది. యీ మహా సభలోనే యీ విషయమై తీర్మానరూపంలో సమర్పించబోతున్నాము.

భారత వర్షమున ఆంధ్ర జాతి, ఐతరేయ పురాణకాలమునాటికే వర్ధిల్లుచున్నదనే విషయం ఎల్లరెరిగినదే.

15, 16 శతాబ్దములలో కడపటి హైందవ సామ్రాజ్యమగు విజయనగర సామ్రాజ్యం ప్రస్తుత ఆంధ్రరాష్ట్ర సరిహద్దులలనుంచి వ్యాపించినది. అంతకు పూర్వమే శాతవాహనులు, చాళుక్యులు, పల్లవులు, కాకతీయులు మున్నగు ప్రఖ్యాత రాజవంశములవారు యీ భాగమును పాలించియుండిరి. ఆంధ్రుల చరిత్ర, కేవలము రాజకీయమైనదే కాదు. ఆంధ్రులు భారత సంస్కృతికి బహుముఖముగా దోహద మిచ్చినారు. సాంచిలో ఆంధ్రుల ప్రాచీన శిల్ప సంపద నేటికినీ కాననగు. జగద్విఖ్యాతమైన అజంతా, ఎల్లోరా శిల్ప సంపదలను సృష్టించిన ప్రఖ్యాతి ఆంధ్రులదే. ఈ ప్రదేశమునుండి 20 మైళ్ళ దూరంలో నున్న సుప్రసిద్ధమైన అమరావతి స్థూపం, 80 మైళ్ళ మేరలో నాగార్జున విహారమును, మన ప్రాచీనుల ప్రతిభాన్వితమైన శిల్ప నైపుణ్యమునకు నిదర్శనమైన మచ్చుతునకలు. ప్రాచ్య భాషలలో ఇటాలియన్ భాషవంటిదని పేరు గాంచినది మన తెలుగుభాష. పదలాలిత్యమునకును, సంస్కృతజన్యమైన శబ్దసౌభాగ్యమునకునూ మన భాష పెట్టినది పేరు.

1951 సం॥ లో ఆంధ్రుల జనసంఖ్య 3 కోట్ల 30 లక్షలు. కాని యీనాడు దాదాపు 30 లక్షల ఆంధ్రులు పరిసర రాష్ట్ర సరిహద్దు ప్రాంతాలలో వుండిపోయినారు. ఆంధ్రరాష్ట్రం హద్దులలోపల యిప్పటి జనసంఖ్య 2 కోట్లకు పై బడియున్నది. రాష్ట్ర పునర్నిర్మాణ సంఘమువారు యింతవరకు చేసిన సిఫార్సుల ననుసరించి హిందూదేశ పటము మార్పు చెందనున్నది. మనరాష్ట్రపు సరిహద్దు చేరువలోనుండి, యితర రాష్ట్ర సరిహద్దుల లోపల మన ఆంధ్రులు నివసించుచున్న ప్రాంతముల మనం కోరుచున్నాం. నేను ప్రత్యేకంగా తెలంగాణాను గూర్చి మాట్లాడుచున్నాను. మనం విశాలాంధ్ర రాష్ట్రం నిర్మించుకొనుటకు తెలంగాణ మన ఆంధ్రలో కలియవలసియున్నది. కాని కొన్నిలక్షలమంది ఆంధ్రులు

మద్రాసు, మైసూరు, మధ్యప్రదేశ్, ఒరిస్సా రాష్ట్రములలో మన సరిహద్దులకు చేరువగా నివసించుచున్నారు. ఇటీవల్ల మన శాసనసభ, యీ రాష్ట్ర సరిహద్దు సమస్యలను స్నేహపూర్వకంగా యితర రాష్ట్రములతో సంప్రదింపుల ద్వారా పరిష్కరించుకొన వచ్చునని, లేదా కాంగ్రెస్ కార్యవర్గముగాని, కేంద్ర ప్రభుత్వముయొక్క నిర్ణయమునకు సమ్మతించవలెనని, తీర్మానం చేసియున్నది. అందువల్ల ప్రస్తుతం ఆవివరములలోనికి పోవుట అనవసరము.

ఇంక జనసంఖ్య విషయంలో మన ఆంధ్రదేశము భారతదేశములో ద్వితీయ స్థాన మాక్రమించియున్నది. ప్రస్తుత ఆంధ్రరాష్ట్ర సరిహద్దుల బయటనున్న ప్రాంతములను మనము కోరుటలోగల ప్రధాన కారణము అచ్చట తెలుగు మాట్లాడువారున్నారని మాత్రమేకాదు. కాని బహువిధములైన పరిపాలనా సౌలభ్యమే ప్రబల కారణము. దేశంమొత్తం మీాద, మన రాష్ట్రంలో ప్రఖ్యాతమయిన జీవనదులు ప్రవహించుచున్నవి. అందు ముఖ్యమైనవి మూడు గొప్ప జీవనదులు. 36 బలీయమైన సెలయేళ్లుకలవు. రాష్ట్రంలోనిభూగర్భసంపద యింకను మనఉపయోగములోనికి రాలేదు. మన రాష్ట్రం భారీ పరిశ్రమలలో వెనుకబడియున్నను, వ్యవసాయరంగంలో పురోగమించుచున్నది. అందును ప్రత్యేకంగా ఆహారధాన్యముల విషయంలోను పరిశ్రమలకు కావలసిన ముడిసరుకు విషయంలోను పుష్కలమై యున్నది. మన నదులు, సెలయేళ్లు, యితర రాష్ట్రములలో, తెలుగు మాట్లాడువారు నివశించు ప్రాంతములలో నుంచి మన రాష్ట్రంలోనికి ప్రవహించుచున్నవి. అట్టి ప్రాంతములు మన రాష్ట్రంలో చేరినచో, వ్యవసాయసంపదను పారిశ్రామికసంపదను యింకను అభివృద్ధి చేసికోవచ్చును. తుంగభద్ర నదీజలములు, అందలి విద్యుశ్ఛక్తి మరము క్షామపీడితప్రాంతమైన రాయలసీమజిల్లాలకు ఉపయోగపడునట్టివి.

బళ్ళారి జిల్లాలోని, హొస్పేట, సిరిగుప్ప, బళ్ళారి తాలూకాలను మనం కోరటం కేవలం యీ నీటి వసరుకుచెందిన పరిపాలనా సౌలభ్యం కొరకే. ఇందువల్ల కొందరు ఆంధ్రేతరులు మన రాష్ట్రంలోనికి రావచ్చును. కాని ఈ సందర్భంలో మనమొకవిషయం గుర్తుంచుకొనవలెను. రాష్ట్ర పునర్నిర్మాణ విషయంలో కేంద్ర ప్రభుత్వ నిర్ణయములవలన కొన్ని లక్షల మంది ఆంధ్రులు యితర రాష్ట్రములలో వుండిపోవలసి వస్తుంది. విశాలాంధ్ర ఏర్పాటులో కూడా యిది సంభవింపక తప్పదు.

ఎలాగూ, యీ విషయం మనమీ సభలో కూలంకషంగా చర్చించి మన అభిప్రాయములను కేంద్ర ప్రభుత్వానికి తెలియజేయబోతున్నాము.

మన రాజ్యాంగం అమలులోనికి వచ్చినతరవాత మొదటి 5 సంవత్సరములు పూర్తికాకపూర్వమే, 3 రాష్ట్రములలో మరల ఎన్నికలుజరుపవలసివచ్చినది. అందులో మన రాష్ట్రం ఒకటి. ఆంధ్ర ప్రభుత్వమేర్పడి, రాష్ట్ర అభ్యుదయమునకు ఎన్నోవిధముల కృషిచేసినప్పటికీ, మొదటి సంవత్సరాసాంతంలోనే కమ్యూనిస్టుల ప్రతికూలతవలన, రాచకీయ పార్టీల అనైక్యతవలన మంత్రివర్గం రాజీనామా చేయవలసివచ్చింది.

ఆంధ్ర కమ్యూనిష్టులపాలై పోయినదని కొందరు రాష్ట్రేతరులూ విదేశీయులు కూడా అభిప్రాయపడుచూవచ్చిరి. కాని గత ఫిబ్రవరిలో జరిగిన ఎన్నికలలో ఆంధ్ర ప్రజలు, కాంగ్రెస్‌నకు ప్రజాస్వామికమునకు చేకూర్చిన మహత్తరమైన విజయము వారి అపోహలను పూర్తిగా తొలగించినది.

1951 లో విడిపోయి కాంగ్రెసు వ్యతిరేక పార్టీలుగా ఏర్పడిన ప్రజాస్వామిక వాదులందరు తిరిగి గత ఎన్నికలలో ఐక్య కాంగ్రెస్

పార్టీగా చేరి సమిష్టిగా కమ్యూనిస్టులను ఎదుర్కొని వారికి ప్రజలలో ఏమియు ప్రాబల్యములేదని ఋజువుచేసిరి. ఇప్పుడు మనకు సుస్థిరమైన కాంగ్రెస్ ప్రభుత్వం ఏర్పడినది. మనల నిప్పుడు నెదుర్కొంటున్న ఆర్థిక సమస్యలను, సామర్థ్యంతోను, నిపుణతతోను, పరిష్కరించ పూనుకొనుచున్నది.

మొదటి పంచవర్ష ప్రణాళిక ఆంధ్రరాష్ట్రి అవతరణకు పూర్వమే ప్రారంభించబడింది. ఆప్రణాళిక యిప్పటి మదరాసు రాష్ట్రమునకు, మన రాష్ట్రమునకు కలిపి తయారుచేయబడినది. అందువలన ప్రణాళికలోని పథకములను వేరుచేసి మనము అమలుపరచుకొనవలసి వచ్చినది. ప్రణాళికలో మన వాటాకు వచ్చిన పథకములకు 58 కోట్లు నిర్ణయించబడినది. తరువాత దానిని కేంద్ర ప్రభుత్వము 70 కోట్ల వరకు పెంచుటకు సమ్మతించినది. మన వాటాధనము పూర్తిగా ఖర్చుపెట్టుకొనలేక పోయినాము అయినప్పటికి, చెప్పుకోదగినంత అభివృద్ధినే సాధించగలిగితిమి. అందు తుంగభద్ర ప్రాజెక్టు, మాచికండ్, విద్యుచ్ఛక్తి కేంద్రముల, నిర్మాణముల పరిపూర్తి ప్రత్యేకంగా పేర్కొనదగినవి. ప్రపంచమహా నాయకుడు మన భారత ప్రధాని నెహ్రూ నాగార్జున సాగరప్రాజెక్టుకు చేసిన శంకుస్థాపన, ప్రారంభోత్సవము, ఆంధ్రుల చరిత్రలో మహత్తర ఘట్టము.

ఈ ప్రాజెక్టు చాల పెద్దది. దానికి 122 కోట్లరూపాయలు వెచ్చించవలసియున్నది. ఇది ప్రస్తుతం యింకా వేరుగానేవున్న తెలంగాణా ఆంధ్రరాష్ట్రములను ఐక్యపరిచి విశాలాంధ్ర రాష్ట్ర నిర్మాణమునకు దోహదమిచ్చుచున్నది.

ద్వితీయ పంచవర్ష ప్రణాళిక కూడా తయారైనది. దానిని అమలు జరుపుటకు మన రాష్ట్రానికి 125 కోట్ల రూపాయలు అంచనా

చేయబడినది. ఈ ప్రణాళిక మూలమున మన రాష్ట్రములో 10000 గ్రామములలో అభివృద్ధి కార్యములు నిర్వహింప బడగలవు. దానిలోని వివరములను నేనిక్కడ పేర్కొన నక్కరలేదు. కారణమేమనగా దాని తుది స్వరూపమింకను వెలువడలేదు. కాని ఒక్క విషయం మాత్రం చెప్పగలను. యీ ప్రణాళికకు కేటాయింప బడిన ద్రవ్యమును, తెలంగాణాకు కేటాయింపబడిన ధనమును కలిపి, ఒకే ప్రణాళికగా అమలుపరచినచో యీ రెండవ ప్రణాళిక వలన విశాలాంధ్రకు అనేక విధములుగా ప్రయోజనములు సమకూరును. ఇది తప్పక జరిగితీరుననియును క్రొత్త రాష్ట్రమైన విశాలాంధ్రలో ఆర్థికముగను సాంఘికముగను ఎక్కువ అభివృద్ధి లభింపగలదని నా విశ్వాసము.

భారత దేశమునకు స్వాతంత్ర్యము వచ్చినప్పటినుండి, గడచిన కొలది సంవత్సరములలో భారత దేశమెంత అభివృద్ధి చెందినది అనే విషయమును గూర్చి నేను వివరించి చెప్పనక్కరలేదు. ఈ దేశము యొక్క ప్రఖ్యాతి తారాపథమునందుకొన్నది. మన దేశము పలుకుబడి ప్రపంచ సమస్త దిక్కులందు వ్యాపించినది. దీని యంతకు మనకు ప్రియతమ నాయకులు మన భారత ప్రధానమంత్రి యొక్క అవిరళకృషియే కారణము. భగవంతు డాయనకు చిరాయురారోగ్యములను, అభివృద్ధి నొసగి ఆయన యింకనధికముగా గౌరవ ప్రతిపత్తులనుకలిగి భారతదేశపు ప్రఖ్యాతిని ప్రపంచ జాతులలో మరింత పెంపొందింపచేయగలడని నమ్ముచున్నాను. భారత దేశము ప్రథమ, ద్వితీయ ప్రణాళికలలో సాధించుకొనిన ఆర్థికాభివృద్ధి గర్వింపదగినది. ఈదేశము సాధించిన అభివృద్ధి యావత్ప్రపంచమువారి దృష్టిపథము నాకర్షించినది. నియంతృత్వ పంథాలో సాధించే అభివృద్ధికి ఏమాత్రము తీసిపోక ప్రజాస్వామ్య మార్గమున సాధించిన అభివృద్ధి చరిత్రాగగలదని ఋజువైన విషయం ముఖ్యంగా గమనించ దగినది.

నే నింక యితర వివరములగూర్చి ప్రస్తావించదలచలేదు. మన మహత్తర నాయకుడు, ప్రేమపాత్రుడైన దేశభక్తుడు, ప్రధాన మంత్రి అగు జవహర్‌లాల్ ఉపన్యాసమును వినుటకు మీరెల్లరు వేచియున్నారు. అందుచే శ్రీ నెహ్రూగారిని యీ మహాసభకు ప్రారంభోత్సవము చేయవలసినదిగా ప్రార్థించుచున్నాను. ఆంధ్రుల అభిమాన నాయకుడు రాష్ట్ర ఉపముఖ్యమంత్రి యగు శ్రీ నీలం సంజీవరెడ్డిగారిని యీ యిరువదియవ రాష్ట్ర రాజకీయ మహాసభకు అధ్యక్షత వహించి నిర్వహించవలసినదిగా ప్రార్థించుచున్నాను.

జై హింద్

---

